

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంకాదు

బూట్లు మేజోళ్లు ఎట్లు తొడుక్కోవలెనో ఈనాడు అతను నేర్చుకుంటున్నాడు. జీవితమును గురించి ఎక్కువగా రోజూ అతను తెలుసుకుంటున్నాడు. పళ్లు, పనుచిగుళ్లు భద్రతపట్ల రోజూ శ్రద్ధవహించవలసిన విషయం కూడ మీరు అతనికి బోధించాలి. అతడు వృద్ధుడైనపుడు అతని పళ్లు అప్పటికీ చెక్కుచెదరకుండా, సహజంగా వుంటవి. మీ వివేకమును అతను సర్వదాస్మరించుకుంటూ, అసహ్యకరమైన దంతక్షయం మరియు నొప్పి, పనుచిగుళ్ల బాధలబారి నుండి అతనిని రక్షించి నందుకు మీకు అభివందనాలు అర్పించుతాడు. మీ పిల్లలకు వారెప్పుడో నేర్చుకోదగిన అత్యుత్తమ అలవాట్లను ఈనాడే బోధించండి—ఫొర్‌హన్స్' టూత్‌పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండుట. అమెరికా యందలి దంత వైద్యుడు ఆర్. జె. ఫొర్‌హన్స్‌చే నిర్మించబడిన ఫొర్‌హన్స్' టూత్‌పేస్టు ఒక్కటే ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లు, మెరిసే తెల్లని పళ్లకు తగిన ప్రత్యేక ఓషధి పదార్థములు గలది. ఇప్పుడే ఈ మంచి తీర్మానం చేయండి : జీవితకాలమంతయూ అనుసరించే అలవాటును మీ పిల్లలకు నేడే ప్రారంభించండి... అది రోజూ ఫొర్‌హన్స్' టూత్‌పేస్టును వాడుటయే. ఒక ఉచిత ప్రతి చిన్న రంగుల పుస్తకం "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 15 న.పై. తపాలా బిళ్లలను పంపండి : మేనర్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name*..........................................

*Address*.......................................

C. I ............................................



# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.








# క్షమాపణ

జూను 15 నుంచి జులై 4 వరకు మద్రాసు నగరంలో పవర్ కట్ తీవ్రంగా అమలు జరిగిన కారణం చేత "చందమామ" జులై సంచిక లన్నీ చాలా ఆలస్యంగా వెలువరించడం జరిగింది. ఇందుకు మేము చేయగలిగిన దేమీ లేక పోయినప్పటికీ, మా ఏజెంట్లకూ, పాఠకులకూ కలిగిన అసౌకర్యం గురించి మేము చాలా విచారిస్తున్నా మని మనవి చేస్తున్నాము.

పబ్లిషరు

# అదేముంది!
# ఆ గుప్పిట్లోవి
# ప్యారి మిఠాయిలు

పిల్లలికి రుచికరమైన మంచి పుష్టికరమగు ప్యారీ మిఠాయిలను ఇట్టే కనిపెట్టేశే శక్తి ఉంది. మీవంటి పెద్దవాళ్లు కూడా వీటిని అభిలషిస్తారంటే ఆశ్చర్యం ఏముంది మీకు. ప్యారీ మిఠాయిలతో జీవితం ఒక ఆటగా గడిచి పోతుంది. వాటిని విడిగా కొనవచ్చు లేదా అందమైన డబ్బాలలో కొనవచ్చు. మీ కుటుంబము అతిధులు మీరూ అందరూ పంచుకోండి.

వీటిని వాడారా. లెమన్ బార్లీ కోకోనట్స్. సూపర్ బట్టర్‌స్కాచ్. మిల్క్‌టాఫీ




ప్యారీస్-విశిష్ఠమైన మిఠాయిలను తయారుచేయువారు

ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు



JWT-PRS-2786

# ప్రశ్నోత్తరాలు

1. కె. భాస్కరరావు, విశాఖపట్నం

**రామనవమి కథలో సుమిత్ర (దశరథుని రెండవ భార్య) హేమనగర పాలకుడగు హరసేనుని పుత్రికగా చెప్పబడినది. అది ఎంతవరకు నిజము?**

రామాయణమే ఎంతవరకు నిజమైనదీ చరిత్రకారులు నిర్ణయించలేదు. రామాయణ కథకు సంబంధించి సంతవరకు వాల్మీకి చెప్పినదే వేదమనుకుంటే, అందులో లేని విషయాలు అబద్ధమవుతాయి.

2. జి. కస్తూరి, శ్రీకాకుళం

**వాల్మీకి రామాయణములో ఎక్కువగా ప్రకృతి వర్ణనలు కలవు. మీరు వాటిని వేయుటలేదు. ఎందువలన?**

వర్ణనలు వేస్తూపోతే కథ సాగదు. అదీగాక అన్ని వర్ణనలూ ఒకేలాగుంటాయి. పెద్ద తేడా లుండవు.

3. సి. కోటీశ్వర్, కేసముద్రం

**అన్నయ్యా, మేము బేతాళ కథలు వ్రాసినచో "చందమామ"లో ప్రచురించెదరా?**

బాగుంటే ప్రచురించటానికే మభ్యంతరం? పాఠకులు పంపే బేతాళ కథలు అప్పుడప్పుడూ ప్రచురిస్తూనే ఉన్నామే!

4. ఎన్. సి. పెంచలయ్య, రావిపాడు

**మీరు "చందమామ"లో ప్రచురించే కథలు "చందమామ"ను తెప్పించే పాఠకులే వ్రాయవలయునా?**

అటువంటి నియమ మేమీలేదు.

5. ఎన్. ఎస్. ఎస్. ఎస్. ఎన్. మూర్తి, ఉర్లాం

**"దుర్గేశనందిని" ముఖ చిత్రంగా వెలువడినందుకు సంతోషించాను. కాని—"**

"చందమామ" ముఖ చిత్రం రామాయణానికి చెందినది, అట్ట చివరి బొమ్మ భాగవత కథకు చెందినది.

6. బి. సుబ్బారావు, భీమడోలు

ప్రహ్లాదుడు తండ్రి తపస్సునకు వెళ్ళునప్పుడు గర్భములో నున్నాడు. అతను నూరు దివ్య సంవత్సరములు గొప్ప తపస్సు చేసి, బ్రహ్మచే వరములు బడసి, తిరిగి యింటికి వచ్చినందాక యీ ప్రహ్లాదునికి అయిదు సంవత్సరముల వయసేనా?

మన పురాణాలలో ఉండే కాలమానాన్ని ఎవరో కుర్రాళ్ళు కల్పన చేసినట్టుంటుంది. అందు చేతనే "చందమామ"లో మేము హిరణ్యకశిపుడు "నూరు దివ్య సంవత్సరాలు" తపస్సు చేసినట్టు రాయలేదు.

7. వెన్నవల్లి జయలక్ష్మీదేవి, ఏలూరు

"చందమామ" సంచిక సాధారణంగా ఐదో తారీకున వచ్చేది. కాని (ఈసారి) 20 న వచ్చింది. ఇలా ఐనప్పుడు ఫొటో వ్యాఖ్యలు పంపవచ్చా?

సంచిక ఆలస్యమైనంత మాత్రాన ఫొటో వ్యాఖ్యల పోటీ మానుతామా? వ్యవధి పొడిగిస్తామని మీరే ఊహించవచ్చు.

8. ఆర్. రామారావు, బెంగుళూరు

మన భూమి నుంచి సూర్యుడు, చంద్రుడు మొదలైన గ్రహాలు ఉన్న దూరాన్ని శాస్త్రవేత్తలు చెప్పారుకదా, ఏ కొలత సాధనమూ లేకుండా ఆ దూరాన్ని ఎలా కనుగొన్నారు?

సమీపించటానికి వీలులేని వస్తువుల దూరాన్ని కొలవటానికి గణితం ఉన్నది. ఉదాహరణకు, సూర్యు డెంత దూరాన ఉన్నాడో తెలుసుకోవాలంటే, భూమి మీద కొన్ని వేల మైళ్ళ ఎడంలో ఉన్న రెండు ప్రాంతాల నుంచి ఒకే సమయంలో సూర్యుడే కోణంలో కనిపిస్తాడో నిర్ణయించి ఆ రెండు ప్రాంతాల మధ్య గల నూటి దూరాన్ని తెలుసుకున్నట్టయితే సూర్యుడుండే దూరాన్ని గుణించవచ్చు. మనుష్యు లెక్కరాని పర్వత శిఖరాల ఎత్తులను ఈ విధంగానే గుణిస్తారు.

9. జీ. సత్యనారాయణ రెడ్డి, అరవల్లి

మావయ్యా, సూర్యుడు కొన్ని కోట్ల సంవత్సరములకు నశించునని శాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు. ఎందువలన?

రోజూ అనేక కోట్ల టన్నుల పదార్థాన్ని శక్తిగా మార్చి ప్రసారం చేసే సూర్యుడు ఎప్పటికైనా నశించ కుండా ఉండటం సాధ్యమవుతుందా? మనుషులకున్నట్టే నక్షత్రాలకు కూడా బాల్య యౌవన కౌమార వార్ధక్యా లున్నాయి. ఆకాశాన మనకు కనిపించే నక్షత్రాలలో సూర్యుడి కంటె యువకత్వం గలవీ, ముసలివీ కూడా ఉన్నాయి. వాటిని శాస్త్రజ్ఞులు పోల్చారు.

# పిల్లలకు లాంగ్‌క్లాత్

బిన్నీవారి నూవా మన్నికకు అందానికి డిజైను కావింపబడినది. స్కూలు యూనిఫారములకు సాధారణంగా స్లాక్‌లవలె ఇంట్లో ధరించడానికి నూవా దిట్టంగా ఉండి వెల తక్కువగా ఉండి బాగా మన్నుతుంది. రకరకాల లేత ముదర. మధ్య రంగులలోను తెలుపులోను లభిస్తుంది.





# బిన్నీవారి నూవా




ది బెంగుళూరు ఉల్లెన్, కాటన్ & శిల్కు మిల్సు కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్డు
బెంగుళూర్ 23 బిన్నీ & కంపెనీ లిమిటెడ్, మద్రాసు వారి అంగ సంస్థ

JWT/BM/N/2645

త్వరలో విడుదల

తప్పక చూడండి !




ఇంటర్నేషనల్ రిలీజ్

# మీ కోసమే తయారైనది...

# కొత్త లైఫ్‌బాయ్




చూడండి మీ ప్రియమైన
లైఫ్‌బాయ్ కొత్తసొంపు. సుందరమైన
కొత్త కాగితపు పైమూత. పట్టుకొనుటకు
వాటమైన కొత్త ఆకారంగల బిళ్ల,
మీ కోసమే తయారైందని
పించుతుంది. దానితో స్నానం
మీకు ఆరోగ్యవంతమైన
హాయి గొలుపుతుంది. కొత్త
లైఫ్‌బాయ్ సబ్బును నేడే కొనండి!



**ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో అక్కడ ఆరోగ్యమువున్నది**

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

L. 46-77 TL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

కిందటి నెలలో విద్యుచ్ఛక్తి కొరత ఏర్పడటం చేత జులై "చందమామ" రెండు వారాలు ఆలస్యంగా వెలువడటం జరిగింది. దీనిని బట్టి ఈ నాటి పరిశ్రమలు విద్యుచ్ఛక్తిపై ఎంతగా ఆధారపడి ఉన్నదీ తెలుస్తుంది. ముందుకు వచ్చిన దేశాలతో పోల్చితే, పరిశ్రమల విషయంలో మన దేశం చాలా వెనుకపడి ఉన్నది. మన పురోభివృద్ధి అంతా విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని పెంచుకోవటం పైన ఆధారపడి ఉన్నది.

సంపుటి **35** ఆగస్టు **1964** సంచిక **2**





# భారత చరిత్ర




కృష్ణదేవరాయలు పోర్చుగీసు వారికి కొన్ని సౌకర్యాలు కలిగించి తద్వారా కొంత లాభం పొందాడు. పోర్చుగీసువారు ముస్లిముల నుంచి గోవాను జయించుకున్న అనంతరం, 1510 లో పోర్చుగీసు గవర్నరు భట్కల్ వద్ద ఒక దుర్గాన్ని నిర్మించుకోవటానికి అనుమతి పొందాడు.

ఒక పోర్చుగీసు యాత్రికుడు కృష్ణదేవ రాయలను గొప్పగా పొగడి, ఆయనను మించిన రాజుండడనీ, ఆయనకు గల సంపదా, సామ్రాజ్యమూ, సైన్యమూ మరొక రాజు కుండడనీ అన్నాడు. కృష్ణదేవరాయల కాలంలో విజయనగర సామ్రాజ్య విస్తరణ ఉచ్ఛస్థితి నందుకున్నది, ఆయన పరిపాలనలో కళాసంస్కృతులు పరాకాష్ఠ చెందాయి.

తాను స్వయంగా వైష్ణవుడైనప్పటికీ కృష్ణదేవరాయలు హిందూమత శాఖలన్నిటినీ ఆదరించాడు. ఓడిపోయిన శత్రు రాజుల పట్లా, తనకు కైవసమైన నగరాల ప్రజల పట్లా ఎంతో కారుణ్యమూ, ఔదార్యమూ చూపాడు. తాను కవి కావటమేగాక గొప్ప సాహిత్యప్రియుడూ, కవిపోషకుడూనూ. ఆయనకు గల అసాధారణ యుద్ధ తంత్రజ్ఞతను చూసి ఆయన సామంతులూ, ప్రజలూ ఎంతో మెచ్చుకునేవారు. దేవాలయాలకూ, బ్రాహ్మణులకూ ఆయన ఇచ్చిన ధనానికి అంతులేదు. ఈయన పరిపాలనలో విజయనగర సామ్రాజ్యం విస్తరించితే, ఢిల్లీ సామ్రాజ్యం శల్యావశిష్టమైపోయింది.

అయితే విజయనగర సామ్రాజ్యానికి ప్రమాదకారణాలు లేకపోలేదు. ఉత్తర సరిహద్దున గల బలవంతులైన శత్రువులు విజయనగరం పై కన్ను వేసి ఉన్నారు. ఇద్దరు రాజ ప్రతినిధులు తిరుగుబాటు కూడా చేశారు. వీరిలో ఒకడు మధురను పాలించేవాడు. ఇతను కృష్ణదేవరాయలు

## 35. విజయనగర పతనం

బతికి ఉండగానే (1528 లేక 1529) తిరుగుబాటు చేశాడు. అయితే కృష్ణదేవ రాయలు పోక పూర్వమే ఇతనికి తగిన దండన లభించింది.

1529 లోనో 30 లోనో కృష్ణదేవరాయలు చనిపోయి, అతని సవతి తమ్ముడు అచ్యుత రాయలు రాజ్యానికి వచ్చాడు. మధుర పాలకుణ్ణీ, అతనికి ఆశ్రయ మిచ్చిన తిరువాన్కూరు రాజునూ ఇతనే దండించాడు. అచ్యుతరాయలు ఈవిధంగా తిరుగుబాటులను అణచాడేగాని, పరిపాలన పట్ల అశ్రద్ధవహించి, తన బావమరుదు లిద్దరినీ పైకి రానిచ్చాడు. వారిద్దరూ రాజ్యపాలన తమ వశం చేసుకున్నారు.

ఇది సామంతులు సహించలేకపోయినారు. ఆరవీటి సోదరులైన రామరాజు, తిరుమలరాయలు, వెంకటరాయలు అనే వారి నాయకత్వం కింద రాజ ప్రతినిధులు ప్రతిపక్షమైనారు. అది మొదలు విజయనగర సామ్రాజ్యంలో సంక్షోభం తల ఎత్తింది.

1541 (లేక 1542)లో అచ్యుత రాయలు చనిపోగా అతని కొడుకు వెంకటాద్రి (లేక మొదటి వెంకటరాయలు) రాజ్యానికి వచ్చి ఆరు మాసాలే పాలించాడు. అనంతరం అచ్యుతరాయలు తమ్ముడి కొడుకు



సదాశివరాయలు రాజ్యానికి వచ్చాడు. ఇతను తన మంత్రి అయిన రామరాయలు చేతిలో కీలుబొమ్మ. రామరాయలు సమర్థుడు; కృష్ణదేవరాయల అనంతరం క్షీణించిన విజయనగర సామ్రాజ్యాన్ని తిరిగి ఉన్నతికి తెద్దామనుకున్నాడు.

రామరాయలు ఎత్తుగడ ఏమంటే దక్కను సుల్తానుల మధ్య సాగే అంతః కలహాలలో జోక్యం కలిగించుకుని, ఒకసారి ఒకరినీ, మరొకసారి మరొకరినీ బలపరచటం. ఈ ఎత్తుగడ కొంత కాలం పారింది. తరువాత బెడిసి కొట్టింది. బిజాపూరు మీద దెబ్బతీసే ఉద్దేశంతో రామరాయలు 1543లో అహ్మద్

నగర్, గోలకొండ రాజ్యాలతో సమాఖ్య ఏర్పాటు చేసుకున్నాడు. బిజాపూరు నవాబు అసద్‌ఖాన్ తెలివిగలవాడు; అతను విడి విడిగా గోలకొండతోనూ, విజయనగరంతోనూ శాంతి ఒడంబడికలు చేసుకుని పై సమాఖ్యను భగ్నం చేశాడు.

దక్కను సుల్తానులకు చాలా కాలంగా విజయనగరం పై ద్వేషం రగులుతున్నది. ఒక్క బిరారు తప్ప మిగిలిన దక్కను సల్తనతులన్నీ ఏకమై, 1565 జనవరి 23న రాక్షసతంగడి అనే చోట విజయనగరంతో యుద్ధం చేసి ఓడించాయి. రామరాయలను గోలకొండ నవాబు హుసేన్ నిజాంషా తన చేత్తో చంపేశాడు.

ముస్లిము సేనలు ఈ యుద్ధం తరువాత కొల్లగొట్టిన ధనంతో ప్రతి ఒక్క సాధారణ సైనికుడూ గొప్ప ధనికుడయాడట! మూడో రోజున శత్రు సైనికులు రాజధాని ప్రవేశించారు. నగరం క్రమంగా విధ్వంసం చెయ్యబడింది. అంత సంపత్సమృద్ధంగా ఉన్న నగరం ఆకస్మికంగా నిర్మూలమై పోవటం చరిత్రలో అపూర్వమని చెబుతారు.

తల్లికోట యుద్ధమని చెప్పబడే ఈ యుద్ధం భారత చరిత్రలో ప్రముఖస్థానం కలది. దీనితో దక్షిణ భారతంలో హిందువుల ప్రాభవం అంతరించి, తురుష్క వంశీయుల పరిపాలనకు అవకాశం ఏర్పడింది. అయితే ఈ యుద్ధం అనంతరం కూడా ఆరవీడు రాజులు విజయనగర రాజ్యాన్ని 17 వ శతాబ్దిదాకా నిలబెట్టుకో గలిగారు. దక్కను నవాబుల మధ్య ఏర్పడిన స్పర్థల ఆధారంతో రామరాయల తమ్ముడు తిరుమల రాయలు కొంత లాభం పొందాడు. 1614లో రెండవ వెంకటరాయలు మరణంతో విజయనగర సామ్రాజ్యం పూర్తిగా అంతరించింది. అయితే 1612 లోనే వెంకటరాయలు అనుమతితో రాజా ఒడయర్ అనేవాడు మైసూరు రాజ్యాన్ని స్థాపించుకున్నాడు.





# ప్రహ్లాదుడు

## 4

ప్రహ్లాదుడు దేవి అనే ఆమెను పెళ్ళాడి, ఆమెకు ఆయుష్మంతుడు, శిబి, విరోచనుడు, కుంభుడు, నికుంభుడు అనే కొడుకులను కన్నాడు. వీరిలో ప్రసిద్ధుడు విరోచనుడు. శిబి అనే పురాణ ప్రసిద్ధుడొకడున్నాడుగాని, అతను ప్రహ్లాదుడి కొడుకు కాడు, ఉశీనరుడి కుమారుడు: అతని తల్లి దేవి కాదు, మాధవి.

నృసింహమూర్తి చేత హిరణ్యకశిపుడు చనిపోయిన అనంతరం ప్రహ్లాదుడి జీవితానికి సంబంధించిన అనేక ఘట్టాలు మనకు పురాణాలలో కానవస్తాయి.

తాను రాజుగా ఉన్నప్పుడు ప్రహ్లాదుడికి కూడా స్వర్గాన్ని జయించాలనే కోరిక పుట్టుకొచ్చింది. అతను దేవతలతో యుద్ధం చేసి ఓడిపోయాడు! మరొక సందర్భంలో అతను విష్ణుభక్తిని కోల్పోయి, విష్ణువుతో యుద్ధానికి కూడా పూనుకున్నాడు. ఇది జరగటానికి కారణం: ఒకసారి ప్రహ్లాదుడు ఎవరో మునిని అవమానించగా ఆ ముని అతన్ని శపించాడు. అయితే విష్ణువుతో పోరాటం తటస్థపడిన మీదట ప్రహ్లాదుడికి జ్ఞానోదయమై, అతను తిరిగి విష్ణు భక్తుడయాడు.

చ్యవనమహాముని ఏ నదిలోనో స్నానం చేస్తూ సుడి గుండంలో చిక్కుకుని పాతాళానికి దిగిపోయాడు. అప్పుడక్కడ ఉన్న ప్రహ్లాదుడు ఆయనను గౌరవించి, ఆయన ద్వారా తీర్థయాత్రల మహిమలు తెలుసుకున్నాడు. తనకు కూడా తీర్థాలు సేవించాలనే బుద్ధి పుట్టి అతను చ్యవన మహాముని వెంట సపరివారంగా బయలుదేరి తీర్థయాత్రలు చేయసాగాడు. ఒక తీర్థంలో అతనికి తపస్సు చేసుకుంటున్న నరనారాయణులు కనిపించారు. వారి ముందు

అట్ట చివరి బొమ్మ



అస్త్రాలున్నాయి. అది చూసి ప్రహ్లాదుడు, "వీరు దొంగ మునులలాగా ఉన్నారే! ...నైన మునులైతే వీరికి అస్త్రాలతో ఏం ...?" అన్నాడు.

ఆ మాటలకు నరనారాయణులు అలిగి, ప్రహ్లాదుడితో యుద్ధం చేసి ఓడించారు. ఓడిపోయిన ప్రహ్లాదుడు విష్ణువును ప్రార్థించగా విష్ణువు ప్రత్యక్షమై, "ఈ నరనారాయణులు ఎవరోకాదు నా అంశన పుట్టిన వారే," అని చెప్పాడు.

మరొకసారి ప్రహ్లాదుడి కొడుకు విరోచను డనే వాడూ, అంగిరసు డనే బ్రాహ్మణుని కుమారుడు సుధన్వు డనే వాడూ ఒకే కన్యను వరించి పెళ్ళాడ గోరారు. ఆ సందర్భంలో వారు తమ గుణగణాల విషయంలో పోటీపడి, తీర్పు చెప్ప మని ప్రహ్లాదుడి వద్దకే వచ్చారు. ప్రహ్లాదుడు వారిద్దరిలో ఎవరు అధికులో చెప్పటానికి బిడియపడి, వారిని కశ్యపుడి వద్దకు వెళ్ళ మని సలహా ఇచ్చాడు.

"నిన్ను న్యాయం చెప్పమని కోరు తూంటే, నీవు మమ్మల్ని మరెవరి దగ్గిరికో పొమ్మంటావేమిటి? రాజుగా నీవు మాలో ఎవరు అధికుడో నిష్పక్షపాతంగా చెప్పు, అధర్మం అవలంబించావంటే నీకు చేటు తప్పదు," అన్నాడు సుధన్వుడు.

ఈ మాట విని ప్రహ్లాదుడు, విరోచనుడు తన కొడుకే అయినప్పటికీ, అతని కన్న సుధన్వుడే ఎక్కువని న్యాయంగా తీర్పు చెప్పాడు.

విరోచనుడి కొడుకే బలి. ప్రహ్లాదుడు స్వర్గాన్ని జయించబోయి, దేవతలతో ఓడిపోయిన పిమ్మట తాను తపస్సు చేసుకోబోతూ బలికే రాజ్యాభిషేకం చేశాడు. ఒకసారి బలి తన తాత అయిన ప్రహ్లాదుణ్ణి, "ఒకప్పుడు మన దైత్యులు బల వీర్య సంపన్నులై ఉండేవారు కదా, రానురాను వారి బలం క్షీణిస్తున్నది. ఇందుకు కారణ మేమిటి?" అని అడిగాడు.

దానికి ప్రహ్లాదుడు, "విష్ణువుయొక్క ప్రభావమే అందుకు కారణం," అన్నాడు.

"విష్ణువు అంత గొప్పవాడా? అతన్ని జయించ గల వీరులు మనలో లేరా?" అని బలి అన్నాడు.

"ఓరీ, ఇలా అన్నందుకు ఆ విష్ణువు నిశ్చయంగా నీ నెత్తి అణుస్తాడు!" అన్నాడు ప్రహ్లాదుడు కోపంతో. ప్రహ్లాదు డన్న ఈ మాట అక్షరాలా నిజమయింది.

బలి గొప్ప చక్రవర్తులలో ఒకడు. అతను గొప్ప ధార్మికుడు, ఆడి తప్పనివాడు. అతనికి అశన అనే భార్యయందు రత్నమాల అనే కూతురూ, బాణుడూ, ధృతరాష్ట్రుడూ, నికుంభనాభుడూ, విభీషణుడూ అనే కుమారులూ కలిగారు.

దేవతలు బలిని శాంతంగా రాజ్యం చేసుకోనివ్వక, చీటికీ మాటికీ అడ్డు తగులుతూ బాధించసాగారు. చూసిచూసి, బలి ఇంద్రలోకం మీదికి దండెత్తి వెళ్ళాడు. బలిని ఎదుర్కొనటానికి ఇంద్రుడు భయపడి, తన గురువైన బృహస్పతిని సలహా అడిగితే, "బలిని జయించటం నీవల్ల కాదు. అందుకు నీకు విష్ణువు సహాయం ఉండాలి," అని బృహస్పతి అన్నాడు.

బలి మూడు లోకాలూ జయించి రాజ్యమేలుతుంటే, దేవతలు బ్రహ్మతో మొర



పెట్టుకున్నారు. బ్రహ్మ వారిని వెంటబెట్టు కుని విష్ణుమూర్తి వద్దకు వెళ్ళాడు. బలిని పదభ్రష్టుణ్ణి చేస్తానని విష్ణువు దేవతలకు మాట ఇచ్చి, తాను వామనావతార మెత్తాడు. ఇతను మరుగుజ్జు రూపంలో కశ్యపుడికి అదితి గర్భాన పుట్టి, ఉపనయనం కాగానే భిక్షాటన చేస్తూ, కొన్నాళ్ళకు బలిచక్రవర్తి వద్దకు వచ్చాడు.

బలిచక్రవర్తి ఆ వటువును చూసి, "ఏం కావాలో కోరుకో," అన్నాడు. వామనుడు తనకు మూడడుగుల భూమి చాలు నన్నాడు. బలిచక్రవర్తి అందుకు సరే నన్నాడు. కాని అతని గురువైన శుక్రుడు మోసం తెలుసు కుని, "ఈ వటుడికి మూడడుగుల భూమి ఇవ్వవద్దు," అని సలహా చెప్పాడు. ఆడి తప్పని బలి అందుకు ఒప్పుకోలేదు.

బలిచక్రవర్తి వామనుడు కోరిన భూమిని ధారాదత్తం చేసేటప్పుడు శుక్రుడు కీటక రూపంలో పాత్రలోని కొమ్ముకు అడ్డుపడి జలధార వెలువడకుండా చేశాడు. వామను డొక పుల్లతో కొమ్ములోకి పొడవగా శుక్రుడి కన్నొకటి పోయింది.

ఆ తరువాత బలి వామనుడికి మూడడు గుల భూమి ధారపోశాడు.

వెంటనే వామనుడు విశ్వరూపి అయి ఒక అడుగుతో భూమినీ, రెండవ అడుగుతో ఆకాశాన్నీ ఆక్రమించి, "మూడో అడుగు ఎక్కడ పెట్టను?" అన్నాడు.

"నా తలపైన పెట్టు," అని బలి తల వంచాడు.

అప్పుడు ప్రహ్లాదుడు వచ్చి, "వీడు నీతి పరుడు. వీణ్ణి శిక్షించవద్దు," అని వామ నుణ్ణి వేడుకున్నాడు. వామనుడు బలిని చంపక, అతనిని పాతాళలోకానికి పంపి, అక్కడ రాజుగా చేసి, బలి ఆజ్ఞ నిర్వర్తిం చని రాక్షసులు దండింపబడతారని ప్రకటిం చటమేగాక, తానే స్వయంగా బలికి ద్వార పాలకుడు కూడా అయాడు.






## 3

[బెంగాలులో పఠానుల విజృంభణను అణచటానికి ఢిల్లీ పాదుషా అక్బరు తరఫున రాజా మానసింహుడు కొంత సైన్యంతో వచ్చి వర్ధమాననగరం వద్ద శిబిరం ఏర్పాటు చేసుకున్నాడు. అతని కుమారుడు జగతసింహుడు శత్రువుల జాడలను కనిపెట్టటానికి మందారణ ప్రాంతానికి వచ్చి, అక్కడ శైలేశ్వరాలయంలో మందారణ దుర్గేశుడైన వీరేంద్రసింహుడి కుమార్తెను తిలోత్తమనూ, ఆమె వెంట ఉన్న విమల అనే ఆమెనూ కలుసుకున్నాడు. తిలోత్తమా జగతసింహులకు ప్రథమ వీక్షణంలోనే పరస్పర ప్రేమ ఏర్పడింది. ఆ ప్రేమ క్షణికమైనది కాదు, చాలా గాఢమైనది కూడానూ.

మొగలులకూ, పఠానులకూ యుద్ధం వస్తే పఠానుల పక్షం కావాలనే వీరేంద్ర సింహుడి ఉద్దేశం. దానికి కారణం అతనికి మానసింహుడి పైగల ఆగ్రహమే. అతని గురువైన అభిరామస్వామి మొగలులతోనే చేరటం మంచిదని సలహా ఇచ్చాడు, కాని అది వీరేంద్రుడికి అంతగా తలకెక్కలేదు.]

దుర్గాన్ని ఒరుసుకుంటూ దామోదర నది ప్రవహిస్తున్నది. అటు పక్కగానే కోట పై భాగాన ఉన్న కిటికీ వద్ద కూర్చుని తిలోత్తమ నదిలోని సుడిగుండాలను గమనిస్తున్నది. సూర్యాస్తమయం కాబోతున్నది. నీరెండ అంతటా ప్రసరించింది. నది అవతలి ఒడ్డున ఒక ఎత్తయిన మేడా, పెద్ద పెద్ద చెట్లూ ఉన్నాయి. దుర్గం ఆవరణలో

బంకించంద్ర చట్టోపాధ్యాయ



నెమళ్ళూ, చిలుకలూ, కోయిలలూ, ఇతర పక్షులూ సంతోషంతో కేకలు పెడుతున్నాయి. వేసవి అయినప్పటికీ నది పైనుంచి చల్లని గాలి వీస్తున్నది.

తిలోత్తమ పదహారేళ్ళ వయసు గల బాలిక. గొప్ప సౌందర్యరాశి. ఆమె శరీరం అతి కోమలమైనది. ఆమె ఏదీ చూడటం లేదు, ఏమీ వినటం లేదు; ఆమె ధ్యాస ఎక్కడో ఉన్నది.

కొంచెం సేపటికి దాసీది దీపం తెచ్చి గదిలో ఉంచి వెళ్ళి పోయింది. తిలోత్తమ తన ఆలోచనలను కట్టిపెట్టి, ఒక పుస్తకం తీసుకుని, చదవటానికి దీపం ముందు కూర్చున్నది. ఆ పుస్తకం కాదంబరి. ఆమెకు సంస్కృతం వచ్చును; అభిరామస్వామి వద్ద నేర్చుకున్నది. కొంచెం సేపు చదివి, ఆ పైన సాగక ఆమె ఆ పుస్తకాన్ని అవతల పెట్టి మరొక పుస్తకం తెచ్చుకున్నది. అది వాసవదత్త. ఆమె దాన్ని అవతలపెట్టి గీతా గోవిందం తీసుకున్నది. ఆమె దాన్ని కూడా మూసిపెట్టి పక్కమీద కూర్చుని తిరిగి ఆలోచనలో పడింది.

ఆమె ఆలోచిస్తున్నది. జగతసింహుణ్ణి గురించి!...

విమల అభిరామస్వామి ఉండే ప్రత్యేక గృహానికి వెళ్ళి, తిలోత్తమా, తానూ శైలేశ్వరాలయంలో జగతసింహుణ్ణి కలుసుకున్న ఉదంతమంతా వర్ణించి ఆయనతో చెప్పి, "ఇది జరిగి పధ్నాలుగు రోజులయింది. జగతసింహుణ్ణి తిరిగి ఆ ఆలయంలో కలుసుకుని తిలోత్తమ ఎవరో చెప్పవలిసి ఉన్నది," అన్నది.

"అలాగా. ఇంతకూ నీవేమి చేయాలని నిశ్చయించుకున్నావు?" అని అభిరామస్వామి అడిగాడు.

"ఈ విషయంలో తమరు ఆలోచించి తగిన సలహా ఇస్తారనే మీ వద్దకు వచ్చాను," అన్నది విమల.

"సరే, అయితే ఆ విషయం పూర్తిగా మరిచిపోవలిసిందని నా సలహా!" అన్నాడు అభిరామస్వామి.

విమల కళ్ళనీళ్ళు పెట్టుకుని, "తిలోత్తమకు ఏం దారి చూపను? ఆ పిల్ల నేం చెయ్యను?" అన్నది.

"విమలా, తిలోత్తమ హృదయంలో ప్రేమానురాగాలు మొలకెత్తాయా?" అని అభిరామస్వామి అడిగాడు.

విమల కొంచెంసేపు తటపటాయించి, "స్వామీ, మీతో ఏమని చెప్పేది? ఈ పధ్నాలుగు రోజులుగా ఆ పిల్ల అహోరాత్రాలు అదోక మాదిరిగా ఉంటున్నది. ఆమె మనస్సూ, చర్యలూ అన్నీ గుర్తించ లేనంతగా మారిపోయాయి. ఆమె హృదయంలో ప్రేమానురాగాలు అంకురించటమే గాదు, క్రమంగా వృద్ధి చెందుతున్నాయి కూడా," అన్నది.

అభిరామస్వామి నవ్వి, "మీ అడవాళ్ళెప్పుడూ ఇంతే. ప్రేమ అనగానే దాన్ని గురించి రాద్ధాంతం చేస్తారు; దానికి మార్పే ఉండనట్టు మాట్లాడతారు. తిలోత్తమ పసి పిల్ల. మనస్సు కాస్త చలించినా, ఇతర విషయాలలో పడితే జగతసింహుణ్ణి తప్పక మరిచిపోతుంది," అన్నాడు.



విమల అందుకు సమ్మతించలేదు. తిలోత్తమ ఈ రెండు వారాల కాలంలోనూ ఎలా మారిపోయిందో, నిద్రాహారాలు లేక ఎలా కృశించిపోయిందో అభిరామస్వామి కామె వివరంగా చెప్పింది.

అంతా విని అభిరామస్వామి, "ఆడవాళ్ళ విషయం చెప్పలేం. కాని ఏం చెయ్యాలి? వీరేంద్రసింహుడు కొంచెం కూడా సుముఖుడుగా లేడు," అన్నాడు.

"ఆ భయం చేతనే నేను తిలోత్తమ స్థితిని గురించి దాచి ఉంచాను; ఆమె ఫలానా అని ఆ జగతసింహుడికి కూడా చెప్పలేదు. ఇప్పుడు వీరేంద్రసింహుడు

మానసింహుడితో స్నేహం చేసుకోవటానికి సిద్ధంగా ఉంటే, జగతసింహుణ్ణి అల్లుడుగా ఎందుకు చేసుకోకూడదు?'' అన్నది విమల.

"మానసింహుడు ఈ వివాహానికి అంగీకరిస్తాడని ఏమిటి?'' అని అభిరామస్వామి అడిగాడు.

"ఎందుకు అంగీకరించడు? యువరాజు అనుకూలంగానే ఉన్నాడు కద?'' అన్నది విమల.

"జగతసింహుడు మాత్రం వీరేంద్ర సింహుడి కుమార్తెను పెళ్ళాడటానికి సుముఖుడుగా ఉంటాడని నీవెందు కనుకున్నావు?" అన్నాడు అభిరామస్వామి.

"జాతి, కుల, గౌరవాలకు రెండూ సమానమైన వంశాలే. జయధరసింహుడి పూర్వీకులు యదువంశస్థులే కదా?'' అన్నది విమల.

"యదు వంశంలో పుట్టిన తిలోత్తమ మొగలాయీల బంధువుల ఇంటి కోడలవుతుందా?'' అని అభిరామస్వామి అడిగాడు.

విమల అభిరామస్వామి కేసి నిశ్చలంగా చూస్తూ, "ఎందుకు కాదూ? యదువంశం కన్న హీనవంశమేమున్నది?'' అన్నది.

ఈ మాట వింటూనే అభిరామస్వామి కళ్ళ నిప్పులు రాలుస్తూ, "పాపిష్టిదానా, నీ దౌర్భాగ్యాన్ని ఇంకా మరిచి పోలేదా?



పో, నా ఎదట నుంచి అవతలికి పో!'' అని కఠోరంగా అన్నాడు.

*　　*　　*

జగతసింహుడు తన తండ్రి వద్ద సెలవు తీసుకుని, సైన్యంతో బయలుదేరి పోయాక అతను చేసిన సాహస చర్యలకు పఠాను సైన్యం గడగడ లాడిపోయింది. పఠానులు కుంగి పోయారు. జగతసింహుడు అయిదు వేల సేనతో యాభై వేల సైన్యం గల కతలూ ఖాన్‌ను సువర్ణరేఖా నదిని దాటించి తరిమి వేస్తానని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. ఆ ప్రతిజ్ఞ నెరవేరే అవకాశా లింకా ఏర్పడలేదు, అయినప్పటికీ రెండు వారాల కాలంలో అతను తన సైనికులతో సహా చూపిన శౌర్య ధైర్య పరాక్రమాలను గురించి విని మాన సింహుడు, ''ఫరవాలేదు, నా కొడుకు రాజ పుత్రుల పూర్వపు కీర్తి ప్రతిష్ఠలను తిరిగి నిలబెడతాడు!'' అనుకున్నాడు.

యాభై వేల సైన్యాన్ని అయిదు వేల సేనతో ఎదిరించి పోరాడి నెగ్గటం సాధ్యం కాదని జగతసింహుడికి తెలుసు; అందువల్ల అపజయమూ, మరణమూ తప్ప మరొక ఫలితం ఉండదు. అందుచేత అత నొక కొత్త యుద్ధ తంత్రం అవలంబించాడు. అతను తన సేనయొక్క ఆచోకీ ఏమాత్రమూ బయట పడకుండా ఉంచాడు.





అతని సైనికులు ఏ క్షణాన, ఎటు నుంచి ఆకస్మికంగా వచ్చి తమ పై పడేదీ శత్రువుల కేమాత్రమూ తెలిసేది కాదు. అతను తన సైనికులను అనేక చిన్న చిన్న దళాలుగా విభజించి, వాటిని దట్టమైన అరణ్యంలోనూ, పర్వత గుహలలోనూ, మిట్టల మీదా, పల్లాల లోనూ దాచి ఉంచాడు. అతనికి అనేక మంది గూఢచారు లుండేవారు. వారు తమ తమ పనులను ఎంతో చాకచక్యంతో చేసుకు పోయేవారు.

జగతసింహు డనుసరించిన ఈ యుద్ధ తంత్రం వల్ల పఠాను సైనికులు అసంఖ్యాకంగా చచ్చారు. వారి సేనలు పెద్ద కంగా రులో పడిపోయాయి. ఇది చూసి పఠాను సేనా నాయకుడు శత్రువులతో సమ్ముఖ యుద్ధం ఎలాగైనా జరిగేలాగు చూడాలని యత్నించాడు. కాని ఈ ప్రయత్నాలను జగతసింహుడు కొన సాగనియ్యలేదు. తమ సైనికులు నాశనమయారన్న వార్తలు కతలూఖాన్‌కు విడవకుండా చేరేవి. ఉదయమని లేదు, మధ్యాహ్నమని లేదు, సాయంకాలమని లేదు — ఎప్పుడు చూసినా దుర్వార్తలే. చిట్టచివరకు పఠాను సైనికులు తమ కోటలను దాటి బయటికి రావటానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. అక్కడ వారికి ఆహారం అందక ఆరోజు కారోజు పరిస్థితి విషమించింది.

పఠానుల అధీనంలో ఉండిన ప్రాంతాలలో తిరిగి శాంతి నెలకొని, అవి తన ఏలుబడికిందికి వస్తున్నాయని తెలిసి సంతోషించి మానసింహుడు తన కుమారుణ్ణి అభినందిస్తూ, మరి పది వేల సేనను కూడా పంపుతున్నట్టు ఉత్తరం రాశాడు.

జగతసింహుడు దానికి జవాబు రాస్తూ, అధికంగా సేన రావటం ఉపయోగమేననీ, అదనపు సేనలు రాకపోయినప్పటికీ, ఉన్న అయిదు వేల సేనతోనే తన ప్రతిజ్ఞ నిలబెట్టుకుంటాననీ తండ్రికి తెలియజేశాడు.

అభిరామస్వామితో మాట్లాడిన మరునాటి సాయంకాలం విమల తన గదిలో కూర్చుని చక్కగా అలంకరణ చేసుకున్నది. ముప్పై ఐదేళ్ళ స్త్రీకి శృంగార మేమిటనవచ్చు. కాని మనసులో యౌవనం ఉన్నవాళ్ళు ఏళ్ళతో సంబంధం లేకుండా శృంగారం చేసుకోవచ్చు. కొందరు ఇరవై ఏళ్ళకే మానసికంగా వృద్ధులైపోతారు. విమల మానసికంగా యౌవనవతి. ఆమె అలంకరించుకుంటున్నంతసేపూ సన్న సన్నగా ఏవో పాటలు పాడుకున్నది. మధ్య మధ్య నవ్వుకున్నది.



అలంకరణ పూర్తి అయాక ఆమె జగత సింహు డిచ్చిన హారాన్ని ధరించి తిన్నగా తిలోత్తమ గదికి పోయింది. తిలోత్తమ ఆమెను చూసి ఆశ్చర్యపడి, "ఇవాళ ఇంతగా ముస్తాబయావేమిటి, విమలా? నిజం చెప్పు, ఎక్కడికి ప్రయాణం?" అని అడిగింది.

"చాలా దూర ప్రయాణం మీద పోతున్నాను," అన్నది విమల.

"నిజం చెప్పు, ఎక్కడికి పోతున్నావు?" అని తిలోత్తమ అడిగింది.

విమల ఆమెను చెయ్యి పట్టుకుని కిటికీ వద్దకు తీసుకుపోయి, ఆమె చెవిలో రహస్యంగా, "నేను శైలేశ్వర మందిరానికి పోతున్నాను. అక్కడ ఒక రాజపుత్రుణ్ణి కలుసుకోవాలి," అన్నది.

ఆ మాటలు వింటూనే, తిలోత్తమ శరీరం ఒక్కసారి ఆపాదమస్తకం పులకించింది. ఆమె ఏమీ అనలేదు.

"అభిరామస్వామి వారితో ఈ సంగతి మాట్లాడాను. నీకూ, జగతసింహుడికీ వివాహం జరగటం సాధ్యంకాదని ఆయన అభిప్రాయం. మీ నాన్నగారు అందుకు సుతరామూ ఒప్పరు. ఆయన సమక్షంలో ఈ సంగతి పొరపాటున బయటికి వచ్చిందో కొంప అంటుకుంటాయి," అన్నది విమల.

తిలోత్తమ తల వంచుకుని, అస్పష్టమైన గొంతుతో, "అయితే మరి దేనికి—అయితే మరి దేనికి—?" అన్నది.

"దేనికేమిటి? ఇవాళ రాత్రికి అతన్ని కలుసుకుని, నీ వెవరో చెబుతానని మాట ఇచ్చాను. అంతమాత్రాన పోయేదేమున్నదీ? నేను చెప్పే దేదో చెప్పాక, అతను చేసేదేదో చేసుకోనీ! ఒకవేళ అతనికి నీ పైన నిజంగానే ప్రేమ ఉన్నపక్షంలో—"

విమల మాట పూర్తి చేసేలోపుగా తిలోత్తమ ఆమె నోటిని మూసి, "నీ మాటలు వింటుంటే నాకు సిగ్గవుతున్నది. పోదలిస్తే నీ యిష్టం వచ్చిన చోటికి పో; కాని నన్ను గురించి ఎవరితోనూ ఏమీ చెప్పనవసరం లేదు," అన్నది.

"అలాటి దానివి ఇంత చిన్న వయస్సులోనే ప్రేమ సముద్రంలో ఎందుకు పడిపోయావు?" అని విమల నవ్వుతూ అడిగింది.

"పో, పో! నీ మాట లేవీ నేను వినను," అన్నది తిలోత్తమ.

"సరే అయితే నేను పోనేపోను," అన్నది విమల.

తిలోత్తమ తల వంచుకుని, "వెళ్ళు," అన్నది. విమల గట్టిగా నవ్వి, "సరే, వెళుతున్నాను. నేను తిరిగి వచ్చేదాకా నీవు నిద్రపోకు," అన్నది.

పోవాలంటే మటుకు నిద్ర రావద్దా అన్నట్టుగా తిలోత్తమ నవ్వింది. విమల ఒక చేతిని తిలోత్తమ భుజం మీద వేసి, రెండో చేత్తో ఆమె గడ్డం పట్టుకుని ఆమె చెక్కిలి ముద్దు పెట్టుకున్నది.

వెళ్ళిపోయేటప్పుడు విమల కళ్ళ నీరు తిరగటం తిలోత్తమ గమనించింది.

విమల తిలోత్తమ గది ద్వారం దాకా వెళ్ళేసరికి, అస్మానీ ఎదురు వచ్చి ఆమెతో, "బాబుగారు పిలుస్తున్నారు," అన్నది.

—(ఇంకా వుంది)





# తెచ్చిపెట్టుకున్న శాపం

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు పడే ప్రయాస చూడగా శాపగ్రస్తుడివా అనిపిస్తున్నది. అయితే నీవు మామూలు శాపగ్రస్తుల లాగా కాకుండా, మత్స్యరాజ కుమార్తె అయిన ముక్తామయి లాగా శాపాన్ని తెచ్చి పెట్టుకున్న వాడి లాగా కనిపిస్తున్నావు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు ఆ రాకుమారి ముక్తామయి వృత్తాంతం చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

మత్స్యలోకపు రాజుకూతురు ముక్తామయి. ఆమె సాటిలేని సౌందర్యవతి. ఆమె సౌందర్యానికి వివశుడై ఫణీముఖు డనే నాగుడామెను పెళ్ళాడ గోరాడు. అయితే అతను బొత్తిగా వికారమైన రూపం గలవాడు

## బేతాళ కథలు



కావటం చేత ముక్తామయి అతన్ని చూడ టానికే అసహ్యపడింది.

"మా పిల్ల నిన్ను చేసు కోవటం అసంభవం. లేని పోని ఆశలు మాను," అని ముక్తామయి తల్లిదండ్రులు ఫణీముఖుడికి స్పష్టంగా చెప్పేశారు.

కాని ఫణీముఖుడి కోరిక తగ్గకపోగా మరింత అయింది. అతను ముక్తామయిని అపహరించుకు పోవటానికి కూడా ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం కొనసాగకపోగా, బయటపడి జలచరాల కన్నిటికీ తెలిసి పోయింది. ఆ తరవాత ఫణీముఖుడికి మత్స్యలోక ప్రాణులు శాంతి లేకుండా చేశాయి. ఆ బాధ పడలేక ఫణీముఖుడు చంపాసరోవరం ద్వారా భూమి పైకి వచ్చి చేరి, ఆ సరోవరం పక్కనే ఉన్న ఒక పుట్టలో నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

ఫణీముఖుడు మత్స్యలోకాన్ని విడిచి వెళ్ళాక ముక్తామయికి మనస్సు కుదట పడింది. అప్పటిదాకా ప్రాణా లరచేత బట్టుకుని, ఫణీముఖుడు ఎటునుంచి వచ్చి పడి తనను అపహరించుకు పోతాడో అని భయపడుతూ ఉండిన ముక్తామయి ఇప్పుడు స్వేచ్ఛగా తిరగసాగింది.

ఇలా సంచరిస్తూ ఒకనాడామె చంపా సరోవర మార్గాన భూలోకంలోని చంపా రణ్యాన్ని చేరుకున్నది. ఆమె అదివర కెన్నడూ భూలోకాన్ని చూసి ఉండలేదు. అందుచేత చంపారణ్య దృశ్యా లామెకు అతి విచిత్రం గానూ, వింత సౌందర్యంతో కూడినవి గానూ కనిపించాయి.

ముక్తామయి ఈ వింతలను చూడటంలో నిమగ్నురాలై ఉండగా పుట్టలో ఉన్న ఫణీముఖుడామెను సమీపించి, "నా కోసం వచ్చావా? రా! నన్ను పెళ్ళాడి ఇక్కడే ఉండిపో!" అన్నాడు.

ఫణీముఖుణ్ణి చూడగానే ముక్తామయి కెవ్వున అరిచి చంపాసరోవరం లోకి దూక

యత్నించింది, కాని ఫణీముఖు డామెను సరోవరాన్ని సమీపించనియ్యలేదు. ముక్తా మయి ఒక వంక భయంతో వణికిపోతూ, ఫణీముఖుడికి చిక్కకుండా పరిగెత్తుతూ, ఆర్తనాదాలు చెయ్యసాగింది.

ఈ కేకలను ఆ దేశపు యువరాజు జగంధరు డనే వాడు విని పరిగెత్తుకుంటూ వచ్చి, అతిలోకసుందరి అయిన ముక్తామయినీ, ఆమెను వెంటాడుతున్న ఫణీముఖుణ్ణీ చూశాడు. అతను ఆ ప్రాంతానికి వేట కోసం వచ్చి, వన్యమృగాలకు బదులు ఈ ఇద్దరినీ చూశాడు.




ముక్తామయి అతని కేసి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఈ దుర్మార్గుడు నన్ను వెంటబడి తరుముతున్నాడు. వీణ్ణి చంపి నన్ను కాపాడండి," అన్నది.

అతిసాహసి అయిన జగంధరుడు కత్తి దూసి, ఫణీముఖుడిపై కలియబడి అతని తలపై బలంగా ఒక్క దెబ్బ కొట్టాడు. ఈ అవకాశం చూసుకుని ముక్తామయి సరోవరంలోకి దూకి, తల పైకి పెట్టి జరిగే దంతా చూస్తున్నది.

జగంధరుడు కొట్టిన దెబ్బకు ప్రాణాలు వదులుతూ ఫణీముఖుడు, "నాకు భార్యవు కావటానికి నిరాకరించినది చాలక, పని పెట్టుకుని నేనున్న చోటికి వచ్చి నన్ను రెచ్చగొట్టి, ఈ రాజకుమారుడి చేత నన్ను చంపించావు గనక, ఇతని కారణంగా నువ్వీ లోకంలో అడుగుపెట్టిన మరుక్షణం శిల అయిపోవుదువుగాక!" అని ముక్తామయిని శపించి చచ్చిపోయాడు.

ఈ మాటలను వింటూనే ముక్తామయి సరోవరంలో మునిగి, తిన్నగా తన లోకానికి వెళ్ళిపోయింది.

ఈ సంఘటన జగంధరుడు గమనించ లేదు. అతను ఫణీముఖుణ్ణి కొట్టిన మరు క్షణం అతనున్న చోటికి అతని పరివారం వాళ్ళు వచ్చారు. అతని కత్తికి రక్తం

ఉండటం చూసి, అతను గాయపడ్డాడేమో నని భయపడ్డారు.

"నా కేమీ గాయం తగలలేదు. నా చేత దెబ్బతిన్న నాగుడేమయాడో చూడాలి ముందు," అన్నాడతను.

ఫణీముఖు డప్పటికే ప్రాణాలు వది లాడు. ఆ సంగతి గమనించినాక జగం ధరుడు తాను కాపాడిన సుందరి కోసం చుట్టూ కలయ జూశాడు. ఆమె ఎక్కడా కనిపించలేదు. అతను సరోవరాన్ని సమీ పించి అందులోకి చూసేసరికి, లోపలికి దిగి పోతున్న ముక్తామయి మెరుపులాగా క్షణం పాటు కనిపించి అదృశ్యమయింది.

రాజకుమారుడు దేని కోసం వెతుకు తున్నాడో పరివారాని కర్థంకాలేదు. వారిలో ఎవరూ ముక్తామయిని చూడలేదు. ఆమెను గురించి జగంధరుడు వారికి చెప్పదలచ లేదు. అందుచేత అతను వారివెంట అక్కడి నుంచి కదిలి వెళ్ళవలిసి వచ్చింది.

జగంధరుడు ఇంటికి తిరిగి వెళ్ళాడేగాని అతని మనస్సు చంపా సరస్సు వద్ద నే ఉన్నది. అతను ముక్తామయి సౌందర్యాన్ని మరిచిపోలేక పోయాడు. రెండు మూడు రోజు లతనికి రెండు మూడు యుగాలుగా గడిచాయి. ఆమెను చూడకపోతే అతని ప్రాణాలు నిలిచేటట్టు లేవు. అందుచేత



అతను ఒకనాడు ఎవరికీ చెప్పకుండా ఒంట రిగా బయలుదేరి చంపారణ్యానికి వెళ్ళాడు. చంపాసరోవరం దగ్గిర చాలాసేపు తారట్లాడి, నీటిలో నుంచి ముక్తామయి పైకి వస్తుందేమో నని చూశాడు.

తలవని తలంపుగా అతనికి సరోవర తీరాన ఒక మణి దొరికింది. అది ఫణీ ముఖుడి తల నుంచి రాలి పడిన మణి. జగంధరు డామణిని తీసుకోగానే అతనికి జలభయం ఏమాత్రం కూడా లేకుండా పోయింది. అతను ఒక్కసారిగా చంపా సరోవరంలోకి దూకాడు. అతనికి నీరు దారి ఇస్తున్నట్టనిపించింది. ఏమాత్రమూ బాధ గాని, శ్రమగాని లేకుండా అతను మత్స్య లోకాన్ని చేరుకున్నాడు.

ఈలోపుగా ముక్తామయికి కూడా జగం ధరుడికి కలిగిన స్థితే కలిగింది. ఆమె తనను కాపాడిన జగంధరుణ్ణి ఆ క్షణం నుంచీ ప్రేమించింది. ఫణీముఖుడు శపించకపోతే ఆమె తన తల్లిదండ్రులనూ, తన లోకాన్ని విడిచిపెట్టి జగంధరుడి వెంట వెళ్ళి ఉండి, అతనికి భార్య అయేదే. కాని ఇప్పుడు ఆమెకు తన ప్రియుణ్ణి చూసే మార్గం ఏదీ లేదు. తాను భూమి మీద అడుగుపెట్టటానికి లేదు. జగంధరుడు తన లోకానికి రాలేడు. అందుచేత ఆమె ఎవరితోనూ ఏమీ చెప్పక,





తన భగ్న ప్రేమను తన హృదయంలోనే దాచుకుని బాధపడసాగింది.

ఈ స్థితిలో ఉన్న ముక్తామయికి ఎవరో మానవుడు తమ లోకానికి వచ్చినట్టు తెలిసింది. ఆమె పరిగెత్తుకుంటూ వెళ్ళి జగంధరుణ్ణి చూసి, తన నోములన్నీ పండినట్టుగా సంతోషించి, అతనికి స్వాగతం చెప్పి తమ ఇంటికి తీసుకు వచ్చింది.

వారిద్దరూ తమ ప్రేమను ఒకరి కొకరు వ్యక్తం చేసుకున్న మీదట ముక్తామయి తల్లిదండ్రులు వారి వివాహానికి సంతోషంగా ఒప్పుకున్నారు. అతని వెంట తమ కుమార్తె భూలోకానికి వెళ్ళటానికి కూడా వారు సమ్మతించారు. కాని ముక్తామయి తాను భూలోకానికి ఏ పరిస్థితిలోనూ వెళ్ళనని స్పష్టంగా చెప్పేసింది.

"నీ కన్న ప్రియమైనది నాకు భూలోకంలో ఏమీలేదు. నే నిక్కడే ఉండిపోతాను," అన్నాడు జగంధరుడు. ఈ మాటకు ముక్తామయి తల్లిదండ్రులు మరింత సంతోషించారు.

జగంధరుడు మత్స్యలోకంలో అయిదు సంవత్సరాలపాటు అనుభవించవలసిన సుఖాలన్నీ అనుభవించాడు. అతనికి ఒక కొడుకూ, కూతురూ కూడా కలిగారు.

అంత కాలానికి జగంధరుడికి తన దేశం వెళ్ళి తన వాళ్ళు ఎలా ఉన్నారో చూడాలన్న కోరిక కలిగింది. అతను తన భార్యతో చెప్పి, మణి సహాయంతో చంపాసరస్సు మార్గాన భూలోకానికి చేరుకుని ఇంటికి వచ్చేశాడు.

అప్పటికి అతని ఇంటి వద్ద క్లిష్టపరిస్థితి ఏర్పడి ఉన్నది. జగంధరుడు కనిపించకుండా పోయాక అతని కోసం ఎంతగానో వెతికారు. అతను ఎటు వెళ్ళినదీ, ఏమైనదీ చెప్పేవారు ఒక్కరూ లేకపోయారు.

అదిమొదలు జగంధరుడి తండ్రికి తీరని మనోవ్యాధి ఏర్పడి కాలక్రమాన అయన

మంచం పట్టాడు. ఎంతమంది వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా ఆయన వ్యాధి తిరుగుముఖం కాలేదు. ఆయన సంగతి ఇవాళో, రేపో అన్నట్టున్నది. ఆయన పోతే సింహాసనానికి వారసుడు కూడా లేడు.

అటువంటి స్థితిలో జగంధరుడు తిరిగి వచ్చాడు. కొడుకును చూడగానే రాజుగారికి కొత్త ప్రాణం వచ్చినట్టయింది. జగంధరుడి కథ అంతా విన్నాక రాజు, అయిందేదో అయిందనీ, జగంధరుడు తగిన మానవ స్త్రీని పెళ్ళాడి రాజ్యాభిషేకం చేసుకుని రాజ్యపాలన సాగిస్తే ముసలితనంలో తనకు మనశ్శాంతి ఉంటుందనీ అన్నాడు.

"ఈ జన్మకు ముక్తామయి ఒకతే నాకు భార్య. నే నింకొకతెను పెళ్ళాడను," అని జగంధరుడు తండ్రికి చెప్పాడు.

"అయితే ఆమెనే తీసుకువచ్చి సుఖంగా రాజ్యం చేసుకో," అన్నాడు పెద్ద రాజు.

భూలోకానికి రావటం తన కిష్టంలేదని ముక్తామయి ఏనాడో చెప్పింది. అయినా పరిస్థితులనుబట్టి ఆమె తన అభిప్రాయం మార్చుకుంటుందని జగంధరుడు నమ్మాడు. అతను మర్త్యలోకానికి తిరిగి వచ్చి తన భార్యకు సంగతంతా చెప్పి, తన వెంట రమ్మని ఆమెను ప్రార్థించాడు.



ముక్తామయి అంతా విని, "పోనీ, మీ తండ్రిగారు కోరినట్టు మీరొక రాజకుమార్తెను పెళ్ళాడి ఆమెతో కాపరం చేస్తూ రాజ్యం చూసుకోండి," అన్నది.

"అది నాకు సాధ్యం కాని పని. నేను నిన్ను తప్ప మరొకతెను ప్రేమించలేను. పెళ్ళాడలేను. భూలోకంలో అడుగుపెట్టనని నీ కెందుకు పట్టుదల?" అని అడిగాడు జగంధరుడు.

ముక్తామయి తల్లిదండ్రులు కూడా అతని మాటనే బలపరిచారు.

"సరే పదండి," అని ముక్తామయి జగంధరుడి వెంట భూలోకానికి బయలుదేరింది.

ఆమె చంపాసరస్సు నుంచి ఒడ్డున కాలు పెడుతూనే, ఫణీముఖుడి శాపం తగిలి శిలగా మారిపోయింది.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా నా కొక సందేహం. ముక్తామయి తెలిసి తెలిసి శాపానికి తనను తాను ఎందుకు గురి చేసుకున్నది? తన శాపం గురించి మాట మాత్రం చెబితే జగంధరుడు తన కీ దుస్థితి కలగనివ్వడు కదా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ముక్తామయి ప్రవర్తనకు రెండు కారణాలున్నాయి. ఆమె జగంధరుడి ప్రేమను అతి పవిత్రంగా భావించింది. అతను మరొకతెను పెళ్ళాడటానికి నిరాకరించటాన్ని బట్టే ఆ ప్రేమ ఎంతటిదో రుజువయింది. అలాటప్పుడు ఆమె తన శాపం గురించి చెప్పిన పక్షంలో జగంధరుడు తన రాజ్యాన్నీ, కర్తవ్యాన్నీ విడిచి మర్త్యలోకంలోనే ఉండిపోతాడు. కాని అందువల్ల అతని ప్రేమ కొంత దెబ్బ తింటుంది. ప్రేమ కోసం తన కర్తవ్యాన్ని తోసిపుచ్చానన్న భావం అతన్ని తప్పక బాధిస్తుంది. అతను తన ధర్మం నెరవేర్చటానికి ఆ ప్రేమ అడ్డం రాకుండా చూడాలంటే తాను శాపానికి గురికావటం కన్న మరొక మార్గం లేదు. ఇది ఒక కారణం. మరొక కారణ మేమంటే, ముక్తామయి అయిదేళ్ళపాటు తన భర్త ప్రేమను చవిచూచింది. దాని ఫలితంగా ఇద్దరు పిల్లలను కూడా కన్నది. ఇంక వెయ్యేళ్ళు జగంధరుడితో కాపరం చేసినా ఆమె కొత్తగా పొందే అనుభూతి ఏమీ ఉండదు. అందుచేత కూడా ఆమె శాపగ్రస్తురాలు కావటానికి సిద్ధపడింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పాపవిముక్తి

కృతయుగంలో భూమి మీద అంతులేని మహారణ్యాలుండేవి. వాటిలో ఋషులూ, దస్యులూ ఉండే వారు. దస్యులు దొంగలు. ఆ దొంగలలో మేటి అయిన వాడు విదస్యుడు. వాడు బాటసారులను దోచే వాడు. ఋషుల వద్ద ఏమీ ఉండదు గనక దొంగలు వారి జోలికి సాధారణంగా వెళ్ళే వారు కారు.

ఋషులలో సుమనాకు డనే వాడుండే వాడు. ఆయన ఇంద్రుడి పైన ఋక్కులు అనేకం చెప్పి, వాటితో ఇంద్రుణ్ణి స్తోత్రం చేసే వాడు. సుమనాకు డొక్కడే తనపై ఋక్కులు చదవడం చేత ఇంద్రుడికి ఆయన మీద ఎంతో ప్రీతి ఉండేది. ఆ కారణంగా ఇంద్రుడు ఏడాది కొకసారి వచ్చి, సుమనాకుడి యోగక్షేమాలు విచారించి పోతూ ఉండే వాడు.

ఇంద్రుడు సుమనాకుడికి ఏదైనా వరం ఇవ్వటానికి సిద్ధపడి, ఏమి కావాలో కోరుకొమ్మని అన్నాడు. కాని సుమనాకుడు తనకై ఏమీ కోరక, "నాకు చేయదలచిన మేలేదైనా ఉంటే దాన్ని లోకానికే చెయ్యి," అని ఇంద్రుడితో అన్నాడు.

సుమనాకు డీ మాట అన్న తరవాత ఇంద్రుడికి ఆయన పైన ఆదరం మరింత హెచ్చి, ఏడాదికి రెండుసార్లు సుమనాకుడి వద్దకు వచ్చి, ఆయన చేత ఋక్కులు పాడించుకుని విని, వెళ్ళి పోసాగాడు.

సుమనాకు డొక చోట స్థిరంగా ఆశ్రమం కల్పించుకుని ఉండక, అరణ్య మంతటా సంచరిస్తూ, తన ఋక్కులతో ఇంద్ర మహిమను లోకాని కంతకూ వెల్లడిస్తూ ఉండే వాడు. ఆయన ఆ ఋక్కులను గట్టిగా చదువుతూంటే ఆయన ఏ ప్రాంతాన ఉన్నదీ ఇంద్రుడికి సులువుగా తెలిసేది.

ఒకసారి దేవేంద్రుడు సుమనాకుణ్ణి చూడవచ్చి, తన ఆదరానికి చిహ్నంగా ఒక

కె. భద్రయ్య

అమూల్యమైన కిరీటమూ, రత్నహారమూ సుమనాకుడికి ఇచ్చి, వాటిని ధరించమని ఆయనను నిర్బంధించి వెళ్ళిపోయాడు. సుమనాకుడు వాటిని ధరించాడు. అవే సుమనాకుడికి చావు తెచ్చిపెట్టాయి.

అరణ్యమంతా తిరుగుతూ సుమనాకుడు విదస్యుడుండే ప్రాంతానికి వచ్చాడు. ఆయన వద్ద కిరీటమూ, రత్నహారమూ ఉండటం చూసి విదస్యుడు వాటిని లాక్కున్నాడు. ఇంద్రుడు ప్రీతితో ఇచ్చిన కానుకలను విదస్యుడు తీసుకోవటం సహించలేక సుమనాకుడు వాణ్ణి ప్రతిఘటించాడు. విదస్యుడాయనను చంపేశాడు.

సుమనాకుడు ప్రాణాలు విడుస్తూ, "నన్ను చంపిన పాపం నుంచి విముక్తి పొందటానికి ఎప్పుడూ సత్యమే పలుకు," అన్నాడు విదస్యుడితో.

ఆ మాట విని విదస్యుడు ఆశ్చర్య పడ్డాడు. "ఈ ఋషి చాలా విచిత్రంగా ఉన్నాడు. ఋషు లెవరూ ధరించని కిరీటమూ, హారమూ ధరించాడు. నా చేత చచ్చిపోతూ ఆగ్రహించటానికి బదులు అనుగ్రహించాడు," అనుకున్నాడు వాడు.

సుమనాకుడి వద్ద తీసుకున్న కిరీటాన్నీ, హారాన్నీ విదస్యుడు తానే ధరించాడు. వాటితో వాడికి మరింత బలమూ, తేజస్సూ



వచ్చినట్టయింది. వాణ్ణి చూసి వాడి భార్యా, పరివారమూ మెచ్చుకున్నారు.

కొంత కాలం గడిచింది. సుమనాకుడి కంఠ ధ్వని వినిపించక ఇంద్రుడు ఆందోళన చెందాడు. ఆయన కోసం అరణ్యాలన్నీ వెతుకుతూ, ఒక సంవత్సరం అనంతరం విదస్యుణ్ణి చూశాడు. సుమనాకుడికి తా నిచ్చిన కిరీటం వాడి నెత్తినా, హారం వాడి మెడలోనూ ఉన్నాయి.

"ఈ కిరీటమూ, హారమూ నీ కెలా వచ్చాయి? వీటిని నీ కిచ్చిన మనిషి ఏమయాడు?" అని ఇంద్రుడు విదస్యుణ్ణి అడిగాడు.

"నన్ను చూసి భయపడటానికి మారుగా ఇలా ప్రశ్నిస్తున్నావే, నీవీ లోకానికి చెందిన వాడివిగా లేవు! నీ వెవరివి?" అని విదస్యు డడిగాడు.

"నేను ఇంద్రుణ్ణి. నా భక్తుడూ, మిత్రుడూ, అభిమానీ అయిన సుమనాకుడి కోసం ఏడాదిగా వెతుకుతున్నాను. ఆయనకు నే నిచ్చిన ఈ కిరీటమూ, హారమూ నీ కెలా వచ్చాయి?" అన్నాడు ఇంద్రుడు.

"నేను దస్యుణ్ణి. నా పేరు విదస్యుడు. నీ మిత్రుడూ, భక్తుడూ అయిన ఆ ఋషిని చంపి నేను వీటిని తీసుకున్నాను," అన్నాడు విదస్యుడు.



ఇంద్రుడికి వాడి పైన వచ్చిన కోపం ఆశ్చర్యంగా మారింది. అతను వాడితో, "నే నెవరో తెలిసి, ఆ మునికీ నాకూ ఉండే సంబంధం కూడా తెలిసి ఎంత ధైర్యంగా నిజం చెప్పావు!" అన్నాడు.

"దానికి ఆ ఋషే కారణం. సత్యం పలికి పాప విముక్తి పొందమని నాకు సలహా ఇస్తూ ఆయన ప్రాణాలు వదిలాడు. నీవు ఆయన విషయం మాట్లాడటం చేత నాకా సంగతి జ్ఞాపకం వచ్చింది. నాకు నిజమే చెప్పాలని నియమం ఏమీ లేదు. నేను ఎన్నో అబద్ధాలాడాను, ఎన్నో హత్యలు చేశాను. కాని ఆ ఋషి చచ్చిపోతూ ఆ సలహా ఇచ్చినప్పటి నుంచీ నాకు అబద్ధ మాడటం పిరికితన మనిపించింది. అందుకే నిజం చెప్పాను," అన్నాడు విదస్యుడు.

ఇంద్రుడు ఏడవ నారంభించాడు. అది చూసి విదస్యుడు ఆశ్చర్యంగా, "ఎందు కలా ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

"నా మిత్రుడైన సుమనాకుణ్ణి నిజంగా చంపినది నీవు కాదు—నేనే. నీవు నిమిత్త మాత్రుడివి. నే నా కిరీటమూ, హారమూ ఇవ్వక పోతే ఆయన చావడు. నీ పైన నా కేమీ ఆగ్రహం లేదు. నీ సత్యానికి మెచ్చాను. ఏదైనా వరం అడుగు," అన్నాడు ఇంద్రుడు.

"ఋషి చచ్చిపోతూ సత్యం పలికి పాప విముక్తి పొందమనటం చేత సత్యం పలికానే గాని నాకు పాప విముక్తి పొందాలన్న కోరిక కూడా లేదు. నీకు నిజంగా వరం ఇవ్వాలని ఉంటే నా వంశంలో బ్రహ్మజ్ఞాని పుట్టేటట్టు వరమియ్యి," అన్నాడు విదస్యుడు.

ఇంద్రు డందుకు సమ్మతించాడు. ఇంద్రుడి అనుగ్రహం వల్ల విదస్యుడి వంశంలో కలు డనే వాడు పుట్టి బ్రహ్మజ్ఞాని అయి బ్రాహ్మణత్వం పొంది, గొప్ప కీర్తి తెచ్చుకున్నాడు.





# అమాయకుడితో పందెం

ఒక గ్రామంలో గుణాకరుడూ, ధనాకరుడూ అని ఇద్దరు యువకులుండేవారు. వారు స్నేహితులు. వారిలో గుణాకరుడు బొత్తిగా అమాయకుడు, కల్లా కపటం ఎరగనివాడు. అయినప్పటికీ పిత్రార్జితం పుష్కలంగా ఉండటంచేత గుణాకరుడు పెళ్ళి చేసుకుని, భార్యతో సుఖంగా కాపరం చేస్తున్నాడు.

ధనాకరుడు అలాటి వాడు కాడు. అతను కేవలమూ యుక్తి చేత ధనార్జన చేస్తూ, అందరితోనూ తియ్యగా మాట్లాడుతూ, ఇతరులకు ఏమాత్రమూ బాధ అనిపించకుండానే వారి డబ్బు కాజేస్తూ, ఉపాయంగా జీవయాత్ర సాగిస్తున్నాడు. అతనికి స్నేహితులుండేవారు. అతను గుణాకరుడితో సమాన ఫాయాలోనే స్నేహితం చేశాడు.

ధనాకరుడు తన మిత్రబృందంతో గుణాకరుడి ఇంటికి తరుచుగా వచ్చి కబుర్లతో కాలక్షేపం చేసేవాడు. ఈ కబుర్లలో పందాలూ, పొడుపు కథలూ జాస్తిగా ఉండేవి. చిన్న చిన్న సమస్యలు వెయ్యటమూ, జవాబు చెప్పలేని వాళ్ళు పందెం ఓడిపోవటమూ ఉండేది. దాదాపు ప్రతిసారీ గుణాకరుడే ఓడిపోతూండేవాడు.

అయితే అప్పుడప్పుడూ ధనాకరుడు కావాలని ఓడిపోయి గుణాకరుణ్ణి పందెం గెలవనిచ్చేవాడు. అస్తమానమూ ఓడేవాడికి పందాలలో ఆసక్తి లేకుండా పోతుంది; కాని అప్పుడప్పుడూ గెలవటం చేత గుణాకరుడికి ఈ రకం పందాలలో ఆసక్తి పుట్టింది.

గుణాకరుడు అమాయకుడే గాని అతని భార్య చురుకైనది; ధనాకరుడు లాటి వాళ్ళను చేరనివ్వవద్దని ఆమె భర్తను చాలా సార్లు హెచ్చరించింది. కాని, ఎంతో స్నేహపాత్రుడుగా ప్రవర్తించే ధనాకరుణ్ణి దుష్టుడి కింద జమకట్టి, ఇంటికి రావద్దనటానికి గుణాకరుడికి సాహసం చాలలేదు.

టి. శ్యామలరావు



ఉన్నట్టుండి ఒకనాడు ధనాకరుడు పెద్ద ఎత్తు ఎత్తాడు. పదిమంది స్నేహితుల ఎదట అతను గుణాకరుడితో, "రోజూ మనం పసి పిల్లల్లాగా చిన్న చిన్న పందాలు వేసుకుంటున్నాం. ఇవాళ నేనొక ప్రశ్న వేస్తాను. దానికి నువ్వు సమాధానం చెప్పినట్టయితే నా ఆస్తి యావత్తూ నువు తీసుకో; చెప్ప లేక పోయినట్టయితే నీ ఆస్తి యావత్తూ నా కియ్యి," అన్నాడు.

అక్కడ ఉన్న అతని మిత్రులు, "సమస్య వేసే అవకాశం నీ కొక్కడికే ఉండటం అన్యాయం. గుణాకరుడికి కూడా సమస్య వేసే అవకాశం ఇయ్యి," అన్నారు.

"నేను ప్రశ్న వేసి ఓడటమో, గెలవటమో జరిగాక, అతను కూడా నన్ను ప్రశ్న వేసి ఓడించవచ్చు, గెలవవచ్చు. నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు ధనాకరుడు.

ధనాకరుడు ఈ మాట అనటం గుణాకరుడికి నిష్కపటంగా కనిపించి, అతను పందానికి ఒప్పుకున్నాడు.

ధనాకరుడు ముందు తన ప్రశ్న వేశాడు: వరిపంటకు భూమిని లోతుగా దున్నాలా? వెడల్పుగా దున్నాలా?

పంటలూ, దున్నటాలూ తెలియని గుణాకరుడు కొంచెం ఆలోచించి, "లోతుగానే దున్నాలి," అన్నాడు.

"తప్పు, వెడల్పుగా దున్నటమే ప్రధానం. ఏ రైతునైనా అడుగు," అన్నాడు ధనాకరుడు.

అతని మిత్రులు కుడా గుణాకరుడి సమాధానం తప్పని ఒప్పుకున్నారు. వాళ్ళు గుణాకరుడితో, "నీ సొత్తంతా ధనాకరుడు గెలుచుకున్నాడు. నువు కూడా అతన్ని ఒక ప్రశ్న వెయ్యి," అన్నారు.

గుణాకరుడు, "తమలపాకులు తీగెకు కాస్తాయా? చెట్టుకా?" అని అడిగాడు.

బుద్ధిపూర్వకంగా ఓడిపోవాలని నిర్ణయించుకున్న ధనాకరుడు, "చెట్టుకే," అని సమాధానమిచ్చాడు.

"కాదు, తీగకే! కావలిస్తే తమలపాకు తోటలకు వెళ్ళి చూతాం పద!" అన్నాడు గుణాకరుడు.

"అవసరం లేదు. ధనాకరుడు కూడా ఓడాడు," అన్నారు ధనాకరుడి మిత్రులు. వారు ధనాకరుడితో, "మొదటి పందెం నువు గెలుచుకున్నావు గనక గుణాకరుడి ఆస్తి నీ దవుతుంది. అయితే గుణాకరుడు కూడా రెండో పందెంలో నెగ్గాడు గనక, నీ ఆస్తి గుణాకరుడి దవుతుంది. అందుచేత మీ రిద్దరూ ఆస్తులు మార్చుకోండి," అని సలహా యిచ్చారు.




గుణాకరుడు లోపలికి వెళ్ళి, పందెం గురించి తన భార్యకు చెప్పి, "నన్ను నా ఆస్తినంతా ధనాకరుడికి రాసి ఇవ్వ మంటున్నారు," అన్నాడు.

"ఇది అర్థం లేని పందెం. ఇందుకు నేను ఒప్పుకోనని చెప్పండి," అన్నది గుణాకరుడి భార్య.

గుణాకరుడు వచ్చి, "ఈ పందెం చెల్ల దనీ, దీనికి తాను ఒప్పుకోననీ నా భార్య అంటున్నది," అన్నాడు.

"నీ ఆస్తి మంచిగా రాయించి ఇవ్వక పోతే న్యాయస్థానానికి వెళ్ళి రాబట్టు కుంటాం. నువు పందెంలో ఓడినట్టు మేమంతా సాక్ష్యం ఉన్నాం," అన్నారు ధనాకరుడి మిత్రులు.

వాళ్ళు వెళ్ళి న్యాయాధికారి వద్ద జరిగిన దంతా చెప్పుకుని ఫిర్యాదు చేశారు. రేపు తీర్పు చెప్పుతానని న్యాయాధికారి వారిని పంపించాడు.

మర్నాడు న్యాయస్థానంలో ఉభయపక్షాల వారూ న్యాయాధికారి ఎదట హాజరయారు. న్యాయాధికారి ధనాకరుణ్ణి, "నీకు న్యాయమే కావాలా? ఫిర్యాదు ఉపసంహరించు కుంటావా?" అని అడిగాడు.

"నాకు న్యాయమే కావాలి!" అన్నాడు ధనాకరుడు

న్యాయాధికారి గుణాకరుణ్ణి జరిగిన దంతా వివరంగా చెప్పమన్నాడు. అతను జరిగిన విషయాలు దాచకుండా చెప్పేశాడు.

"అయిన పక్షంలో మొదటి పందెంలో ఓడినందుకు నువు నీ ఆస్తి అంతా ధనాకరుడికి రాసి ఇవ్వవలిసిందే. కాగితం తీసుకుని రాయి," అన్నాడు న్యాయాధికారి.

చేసేది లేక గుణాకరుడు తన ఆస్తి యావత్తూ ధనాకరుడి పరం చేస్తూ రాసి ఇచ్చాడు. న్యాయాధికారి ఆ పత్రాన్ని ధనాకరుడికి ఇప్పించి, "పత్రం సరిగానే ఉన్నది కదా? రెండవ పందెంలో ఓడిపోయినందుకు నీ ఆస్తి అంతా గుణాకరుడి పరం చేస్తూ పత్రం రాసి ఇయ్యి," అన్నాడు.

"చిత్తం, ఆ పత్రం నా వద్ద సిద్ధంగానే ఉన్నది," అంటూ ధనాకరుడు న్యాయాధికారి చేతి కొక పత్రం ఇచ్చాడు.

న్యాయాధికారి దాన్ని చదువుకుని, "ఈ పత్రం చెల్లదు. ఇందులో నీకు ఒక్క చిన్న ఇల్లు మాత్రమే ఉన్నట్టు రాసి ఉన్నది," అన్నాడు.

"అంతే నా ఆస్తి," అన్నాడు ధనాకరుడు.

"కాదు. నువు గుణాకరుడితో పందెం ఓడే సమయానికి గుణాకరుడి ఆస్తి అంతా గెలుచుకుని ఉన్నావు. అదంతా నీ ఆస్తే. అందుచేత అది తిరిగి గుణాకరుడికి చెందాలి. దాని వివరాలన్నీ నీ పత్రంలో రాయటం శ్రమ అనుకున్నట్టయితే, ఇంతకు ముందు గుణాకరుడు నీకు రాసి ఇచ్చిన పత్రం అతనికి తిరిగి ఇవ్వవచ్చు. మీరు వేసుకున్న పందాల ఫలితంగా గుణాకరుడి ఆస్తి చిల్లిగవ్వకూడా నీకు రాదు, కాని నీకున్న ఇల్లు గుణాకరుడి దవుతుంది! న్యాయం కావాలన్నావు గనక న్యాయం చెప్పాను," అన్నాడు న్యాయాధికారి.

ధనాకరుడికి మంచి శాస్తి అయింది. అతను తన కున్న చిన్న ఇంటిని గుణాకరుడి పరం చేసి, ఊరు విడిచి వెళ్ళిపోయాడు.





# ఇద్దరమ్మాయిలు

పూర్వం సౌరాష్ట్రదేశంలో ఒక సంపన్నుడు విధి వైపరీత్యం వల్ల తన కున్నదంతా పోగొట్టుకుని, తన వారినందరినీ కోల్పోయి ముసలితనంలో కటిక దరిద్రుడై పోయాడు. ముసలి తనానికీ, దారిద్ర్యానికీ తోడు సౌదామిని అనే మనమరాలి బరువొకటి అయిన పైన పడింది. ఆయన ఆ మనమరాలితో సహా మరొక చోటికి వెళ్ళి, అక్కడ ఒక గుడిసెలో నివాసం ఏర్పాటు చేసుకుని, కాయ కష్టంచేసి ఏదో ఒక విధంగా తనను తాను పోషించుకుంటూ సౌదామినిని కూడా పోషిస్తూ వచ్చాడు.

కాని రోజులు గడుస్తున్న కొద్దీ తన కృషితో సౌదామిని పోషణ సక్రమంగా సాగదని ఆయనకు తోచింది. ఆమె పన్నెండేళ్ళ పిల్ల. కడుపునిండా తిండైనా లేకపోతే ఆ పిల్ల కాస్త ఏపుగా పెరిగి, పెళ్ళికి యోగ్యురాలు కాదు. అందుచేత ఆయన సౌదామినిని ఒక ధనికుల ఇంట పనిలో పెట్టాడు. ఆ ధనికుడి పేరు విశ్వంభరుడు. ఆయన ముసలివాడి దుస్థితికి జాలిపడి, సౌదామినిని తమ పిల్లలాగే చూసుకుంటానని, తగిన సంబంధం చూసి పెళ్ళి కూడా చేస్తాననీ మాట ఇచ్చాడు.

సౌదామిని చురుకైన పిల్ల. ఇంటి పనులన్నీ చెప్పకుండానే చేసుకుపోయేది. తాత ఎప్పుడన్నా వచ్చి, చూసి వెళ్ళేవాడు. రెండు మూడేళ్ళ అనంతరం ఆయన పోయాక సౌదామినికి విశ్వంభరుడి కుటుంబం తప్ప ప్రపంచంలో మరెవరూ లేకుండాపోయారు.

విశ్వంభరుడు మంచివాడే గాని, అతని భార్య చుప్పనాతి. ఆమెకు చంద్రావళి అనే కూతురున్నది. ఆ పిల్ల కూడా సౌదామిని వయసుదే, కాని ఏ మంత అందగత్తె కాదు. చంద్రావళి ఎన్ని నగలు పెట్టుకున్నా, ఎంత మంచి బట్టలు వేసుకున్నా, సౌదామినే

వి. కమలాదేవి



అందంగా కనబడేది. అది చూసి యజమానురాలు అసూయ పడేది. సౌదామిని ఇంటిపనులే చేస్తూ, మూడుపూటలా కడుపు నిండా అన్నం తిని ఏపుగా పెరిగితే తన కూతురు మరింత అనాకారిగా కనిపించి పోతుందని, ఆమె సౌదామినికి ఆవులను కాసే పని ఇచ్చింది.

సౌదామిని పొద్దున్నే ఇంత చద్ది అన్నం తిని ఆవులను తోలుకుని అడవికి వెళ్ళేది. పేడ ఎత్తటమూ, ఆవులను కడగటమూ, అంట్లు తోమటమూ, బట్టలు ఉతకటమూ మొదలైన పనులే సౌదామిని చేసేది. ఈ రకం పనులతో సౌదామిని త్వరలోనే అందవిహీనంగా తయారయింది. తిండి సరిగా లేక శరీరం కృశించింది. వంటి మీద చింకి పాతలు, జుట్టుకు రాసేందుకు నూనె లేదు, దువ్వటమూ లేదు.

సౌదామిని ఇలా అయినాక విశ్వంభరుడి భార్య మనసు కాస్త ఊరట చెందింది. విశ్వంభరుడికి తన భార్య ప్రవర్తన ఏమీ నచ్చకపోయినా, ఆమె నోటికి వెరిచి చూస్తూ ఊరుకున్నాడు. సౌదామినికి తాను కష్టాలు పడుతున్నానన్న భావం కూడా ఏమీలేదు. ఎందుకంటే ఆమెకు ఉన్న జీవితమే అది.

ఒకనాడు మధ్యాన్నం సౌదామిని ఆవులన్నిటినీ ఒక చెట్టునీడకు తోలి, తన వెంట తెచ్చుకున్న రొట్టె తినబోతూ ఆవులన్నిటినీ ఎంచి చూసుకుంటే, యమున అనే ఆవు కనిపించ లేదు. సౌదామిని కంగారుపడి, తన తిండిమాట కూడా మరిచిపోయి, "యమునా, యమునా," అని కేకలు పెడుతూ ఆ చుట్టుపక్కలంతా సాయంత్రం దాకా వెతికింది. యమున కనిపించనే లేదు. ఆమె ఏడుస్తూ, మిగిలిన ఆవులను తోలుకుని ఇంటికి వచ్చి, తన యజమానురాలితో, "యమున కనిపించ లేదు," అని చెప్పింది. ఈ మాట వింటూనే విశ్వంభరుడి భార్య ఉగ్రురాలై, "కని

పించకపోతే వెతుక్కురా. అది లేకుండా ఇంటికి తిరిగి రాకు!" అన్నది.

ముంచుకు వచ్చే చీకటిలో సౌదామిని తిరిగి అడవి కేసి బయలు దేరింది. ఆమె దారీ తెన్నూ తెలియకుండా అడవి అంతా తిరుగుతూ, "యమునా!" అని కేక పెట్ట సాగింది. ఒకచోట ఆమె పిలుపుకు, "అంబా!" అని సమాధానం వచ్చింది. సౌదామినికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆమె జవాబు వచ్చిన దిక్కుగావెళ్ళి ఒక పర్ణశాలను చేరుకున్నది. పర్ణశాల చుట్టూ దట్టమైన అరణ్యం ఉన్నది. యమున అన్న ఆవు ఆ పర్ణశాల ముందు కట్టబడి ఉన్నది. సౌదామిని ఆ ఆవును సమీపించి, దాన్ని నిమిరి మాట్లాడుతుండగా పర్ణశాల లోపలి నుంచి, "ఆవు కోసం వచ్చావా? లోపలికి రా!" అని ఎవరో ఆహ్వానించారు.

సౌదామిని పర్ణశాల లోపలికి వెళ్ళి అక్కడ ముగ్గురు మరుగుజ్జులుండటం చూసింది. వాళ్ళు చూడటానికి వికారంగా ఉన్నారు. ఆమె తమ కేసి వింతగా చూడటం గమనించి ఒక మరుగుజ్జు, "మమ్మల్ని చూస్తే భయంగా ఉందా?" అని అడిగింది.

"లేదు. నా ఆవును నేను తీసుకు పోతాను," అన్నది సౌదామిని.



"ఆ ఆవు తప్పిపోయి అడవిలో తిరుగుతూ ఉంటే పులివాత పడకుండా కాపాడి తెచ్చాం. నీ ఆవును నువే తీసుకుపోదువు గాని. అయితే మమ్మల్ని చూడవచ్చినవారు ఊరికే పోగూడదు. నీ రూపు మార్చేస్తాను," అంటూ ఆ మరుగుజ్జు, సౌదామినిని తన పక్కన కూర్చోమని, ఆమె తలను తన చేత్తో నిమిరింది. వెంటనే సౌదామిని తల వెంట్రుకలన్నీ రాలి పోయాయి, శరీరం నల్లగా పెంకులాగా అయింది. సౌదామిని వికారంగా అయిపోయింది.

మరుగుజ్జు ఆమెను చూసి నవ్వుతూ, "ఇప్పుడెంత బాగున్నావు!" అన్నది.



మరొక మరుగుజ్జు మొదటి దానితో, "పాపం, ఆ పిల్ల నలా వికారంగా చేశా వేమిటి ?" అన్నది.

"నా మీద కోపమా, అమ్మాయ్ ? నిజం చెప్పు," అని మొదటి మరుగుజ్జు సౌదా మినిని అడిగింది.

"లేదు. మీరు నా అవును కాపాడారు గదా !" అన్నది సౌదామిని.

"అయితే మాకేమన్నా తినటానికియ్యి," అన్నది మొదటి మరుగుజ్జు.

అప్పుడు సౌదామినికి తన రొట్టె జ్ఞాపకం వచ్చింది. అది ఇంకా ఆమె భుజానే మూటగట్టి ఉన్నది.

"ఇదేమంత బాగుండదు !" అంటూ సౌదామిని మూటవిప్పి, రొట్టె పైకి తీసింది.

"పరవాలేదు, ఇయ్యి. మనుషులు తినే రొట్టె ఎలా ఉంటుందో చూస్తాం," అంటూ ఆ మరుగుజ్జు రొట్టె అందుకుని, దాన్ని నాలుగు ముక్కలు చేసి, ముగ్గురు మరుగుజ్జులూ తీసుకోగా మిగిలిన ముక్కను సౌదామిని కిచ్చింది.

రొట్టె ముక్కలు తింటూ మరుగుజ్జులు, "భలే బాగుంది ! భలే బాగుంది !" అని రొట్టెను మెచ్చుకున్నాయి.

"మాకు మంచి తిండిపెట్టావు !" అంటూ రెండో మరుగుజ్జు సౌదామిని తల నిమిరింది. వెంటనే సౌదామిని అప్సరస లాగా మారిపోయింది.

మూడో మరుగుజ్జు సౌదామిని కంఠం నిమిరి, "ఏదీ ఒక పాటపాడు !" అన్నది.

సౌదామిని పాడటానికి గొంతెత్తే సరికి ఆమె కంఠం కోకిల కంఠంలాగా అతి శ్రావ్యంగా వినిపించింది. ఆ అరణ్యంలో ఉండే మృగాలు కూడా ఆ పాటను ఆనందంతో ఆలకించాయి.

ఈ విధంగా మారిపోయి సౌదామిని తెల్ల వారుతూనే తన అవును తోలుకుని ఇంటికి వచ్చేసింది. ఆమెను చూడగానే యజమాను

రాలు కళ్ళలో నిప్పులు పోసుకున్నది. సౌదా మిని కంఠ ధ్వనిలో కలిగిన మార్పూ, ఆమెకు జరిగిన అనుభవమూ విన్నాక ఆమె అసూయ మరింత అయింది.

ఆవిడ తన భర్తతో, "చూశారా దాని అదృష్టం? అడవిలో ఒక పర్ణశాలలో మరు గుజ్జులున్నాయిట. అవి రొట్టెతిని దాని రూపాన్ని ఎలా మార్చాయో చూడండి! ఇవాళ మన అమ్మాయి నక్కడికి తీసుకు పోదాం," అన్నది.

ఆరో జావిడ మంచి పిండివంటకం తయారు చేసి ఆ రాత్రి తన భర్తనూ, కుమార్తెనూ వెంట బెట్టుకుని అడవికి బయలుదేరింది. సౌదామిని చెప్పిన గుర్తుల సహాయంతో వాళ్ళు ముగ్గురూ పర్ణశాలను చేరారు. భార్యా భర్త లిద్దరూ కొంత దూరంలో ఒక చోట ఆగి పోయారు, చంద్రావళి మటుకు వంటకంతో సహా గుడిసెను చేరుకుని, లోపలికి తొంగి చూసింది. దీపపు వెలుగులో ఆమెకు మరుగుజ్జులు ముగ్గురూ కనబడ్డారు.

వాళ్ళు లోపలికి ఆహ్వానించిన మీదట చంద్రావళి లోపలికి వెళ్ళింది.

"నిన్న వచ్చిన అమ్మాయి ద్వారా మా సంగతి తెలుసుకుని వచ్చావా?" అని ఒక మరుగుజ్జు అడిగింది.





"అవును. దాని కన్నా మంచి భక్ష్యం తెచ్చాను. నన్ను దాని కన్న ఇంకా అందగత్తెగా తయారు చెయ్యాలి," అన్నది చంద్రావళి.

"కొత్త రూపు రావాలంటే ఉన్నరూపు పోవాలి. ఆ అమ్మాయిని మార్చేపని నేనే ప్రారంభించాను. కూర్చో," అని మొదటి మరుగుజ్జు చంద్రావళి తల నిమిరింది. వెంటనే ఆమె జుట్టంతా రాలింది. చర్మం నల్లగా అయింది.

చంద్రావళి తనలో కలిగిన మార్పు చూసుకుని కంగారు పడి ఏడుస్తూ, మరుగుజ్జులను తిట్టి బయటికి పారిపోయి, తన తల్లి దండ్రులను చేరుకున్నది. మరుగుజ్జులు చంద్రావళి తెచ్చిన భక్ష్యాల పొట్లాన్ని ఆమె తలిదండ్రుల ఎదట పడేట్టు గిరవాటు వేసి మాయమయాయి.

తమ కుమార్తె వికారాకారం చూసి తల్లి దండ్రులు తీవ్రంగా బాధపడ్డారు. "ఆ సౌదామిని, మనని అబద్ధాలతో మోసగించింది," అన్నది విశ్వంభరుడి భార్య.

వాళ్ళు ఇంటికి వచ్చేశారు. విశ్వంభరుడి భార్య సౌదామినితో, "నువ్వింక మా ఇంటిలో ఉండనవసరం లేదు. నీ ముఖం మాకు చూపించక వెళ్ళిపో!" అన్నది.

ఆ రాత్రివేళ సౌదామినికి ఎక్కడికి పోవటానికీ తోచలేదు. ఆమె పశువుల పాకలోకి వెళ్ళి ఒక మూల కూర్చున్నది.

తన తల్లి దండ్రులు నిద్రపోగానే చంద్రావళి మెల్లిగా లేచి బయటికి వచ్చింది. భయంకరమైన ఆ రూపంతో ఇతరులకు కనిపించే కన్న చచ్చి పోవటమే మేలని ఆమె నిశ్చయించుకున్నది.

చంద్రావళిని చూసి సౌదామిని పశువుల పాక నుంచి బయటికి వచ్చి, "ఎక్కడికి బయలుదేరావు?" అన్నది.

"ఈ రూపంతో బతికి ఉండలేను. ఆత్మహత్య చేసుకుంటాను. నువ్వు పెద్దగా



52

మాట్లాడి అమ్మనూ, నాన్ననూ నిద్ర లేపకు," అన్నది చంద్రావళి.

"నీ విలా కావటం నీ కెంత అవమానమో నాకూ అంతే అవమానం. చావాలిసేవస్తే ఇద్దరమూ చద్దాం. ముందు ఆ మరుగుజ్జుల దగ్గిరికి వెళ్ళి వద్దాం, రా!" అన్నది సౌదామిని.

పర్ణశాలలో మరుగుజ్జులు మామూలు ప్రకారం దీపం పెట్టుకుని కూర్చుని ఉన్నారు. సౌదామిని వారితో, "నా లాగే ఈ అమ్మాయిని కూడా అందంగా చెయ్యండి. అది సాధ్యం కాకపోతే మా యిద్దరినీ చంపెయ్యండి," అన్నది.

"నీ లాగా ఆ అమ్మాయి మమ్మల్ని నమ్మలేక పారిపోయింది. మేమేమో తిండికి ఆశపడతా మనుకుంది, పిచ్చిపిల్ల! నిన్ను చూసి మేం ఈ పిల్లకు కూడా మంచి రూపమూ, కంఠమూ ఇస్తున్నాం," అంటూ రెండో మరుగుజ్జు చంద్రావళి తల నిమిరి ఆమెకు అందమూ, అందానికి తగిన దుస్తులూ ఇచ్చింది. మూడో మరుగుజ్జు ఆమె కంఠం నిమిరి, "ఇద్దరూ కలిసి పాడండి!" అన్నది.

సౌదామినీ, చంద్రావళీ కంఠా లెత్తి శ్రావ్యంగా పాడి, మరుగుజ్జులను తృప్తి పరిచి, తెల్లవారుతూండగా బయలుదేరి ఇంటికి వచ్చేశారు.

ఇంటికి వచ్చేశాక చంద్రావళి తన తల్లితో, తనకు సౌదామిని చేసిన మహోపకారం గురించి వివరంగా చెప్పింది. అది విన్న తరువాత విశ్వంభరుడి భార్య చుప్పనాతిబుద్ధులు మాని సౌదామినిని కూడా తన కూతుర్ని చూసినట్టే చూసుకోసాగింది.

తగిన వయస్సు వచ్చాక విశ్వంభరుడు ఆడపిల్ల లిద్దరికీ ఒకేసారి మంచి సంబంధాలు చూసి, వైభవంగా పెళ్ళిళ్ళు చేసి, సౌదామిని తాతకు తాను చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నాడు.





# విధి బలం

పూర్వం మగధ సామ్రాజ్యాన్ని ఏలిన చక్రవర్తులలో వీరసేనుడు ఒకడు. అతను అనేక యుద్ధాలలో గెలిచి సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు. అందుచేత ఎక్కడెక్కడి కవులూ వచ్చి, అతని శౌర్య పరాక్రమాలను కీర్తిస్తూ శ్లోకాలు చెప్పి, అతని వద్ద మంచి బహుమానాలు పుచ్చుకుంటూ ఉండేవారు.

ఒకసారి పాంచాల దేశం నుంచి విష్ణుశర్మ అనే పండితుడు మగధ దేశానికి వచ్చాడు. రాజుగారి కొలువులో పనిచేసే ఒక అధికారి విష్ణుశర్మకు తన ఇంట బస ఇచ్చి, ఆయనను ఆస్థానానికి కూడా తీసుకుపోయాడు. విష్ణుశర్మ మహా పండితుడని విని రాజుగారు ఆయనకు సభలో ఒక మంచి ఆసనం ఇప్పించాడు.

రోజులాగే ఆనాడు కూడా కవులు వచ్చి రాజుగారిని కీర్తిస్తూ శ్లోకాలు చదివారు. విష్ణుశర్మ మెచ్చుకోగలందులకు రాజు కవులకు విరివిగా బహుమానా లిప్పించాడు. ఈ తంతు యావత్తూ చూస్తున్న విష్ణుశర్మకు రాజుగారి వైఖరి పైన అసహ్యం పుట్టింది. ఆయన నిండు సభలో లేచి నిలబడి ఈ విధంగా శ్లోకం చెప్పాడు:

"ఏన యత్రైవ భోక్తవ్యం,
సుఖంవా దుఃఖమేవవా
స తత్ర బద్ధ్వా రజ్జైవ,
బలా ద్దైవేన నీయతే."

[ఎవడుగాని ఏయే వేళ సుఖంగాని, దుఃఖంగాని అనుభవించ వలసి ఉంటుందో, వాడు తాడు గట్టి ఈడ్చినట్టుగా దైవం చేత లాగబడతాడు.]

ఈ శ్లోకంలో రాజుగారి ప్రశంస ఏమీ లేకపోగా కొంత వ్యంగ్య విమర్శ ఉన్నది. అందుచేత రాజుగారు ఆగ్రహిస్తాడని అందరూ అనుకున్నారు. కాని రాజుగారు శ్లోకంలోని భావాన్ని ఆమోదించిన వాడిలాగా

ఎస్. నాగేశ్వరరావు

మెచ్చుకుని, మంత్రితో, "ఈ పండితుడికి ప్రత్యేక బహుమానం ఇప్పించండి," అని రహస్యంగా ఏదో చెప్పాడు.

మంత్రి ఒక కాగితంపైన ఏదో రాసి తెచ్చి రాజుగారికి చూపించాడు. రాజుగారు ఆమోదించి తన ముద్ర దానిపై వేసి, కాగితాన్ని మడిచి, లక్క ముద్ర వేయించి, విష్ణుశర్మకు ఇప్పించాడు.

మంత్రి విష్ణుశర్మతో, "దీన్ని తీసుకు పోయి కోశాధికారి కివ్వండి. మీకు బహుమానం ముట్టుతుంది," అన్నాడు.

సభ ముగిసినాక విష్ణుశర్మకు ఆతిథ్యం ఇచ్చిన రాజోద్యోగి, "మీకు రావలసిన బహుమానమేదో నేను తేలికగా వసూలు చేసి పట్టుకు రాగలను. దివాణానికి చెందిన వాణ్ణి గనక నాకు సాధ్యమవుతుంది గాని, అది తమ లాటి పై వాళ్ళకు సాధ్యంకాదు. తమరు తిన్నగా ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

అసలు సంగతేమంటే విష్ణుశర్మ పొంద బోయే బహుమానంలో వీలయినంత తాను కాజేతామనే రాజోద్యోగి ఉద్దేశం. ఇది అందరు రాజోద్యోగులూ చేసేపనే. అందుకే నగరంలోకి పేరు ప్రతిష్ఠలు గల వాళ్ళు వచ్చినట్టు తెలియగానే, వారిని తమ ఇళ్ళకు



తీసుకుపోయి మర్యాద చేసి బస ఏర్పాటు చేసే వారు.

మంత్రి విష్ణుశర్మకు అందజేసిన రహస్య పత్రాన్ని తీసుకుపోయి రాజోద్యోకి కోశాధికారి దగ్గిర ఇచ్చాడు. ఆ పత్రంలో ఇలా ఉన్నది: "ఈ పత్రం తెచ్చినవాణ్ణి తక్షణం ఖైదులో పెట్టించి, రేపు తెల్లవారేలోగా తల తీసేసే ఏర్పాటు చేయించు. అంతా రహస్యంగా జరిగిపోవాలి."

రాజోద్యోగిని క్షణాల మీద ఒక రహస్య స్థానంలో ఖైదు చేశారు.

మర్నాడు తెల్లవారు జామున రాజు ఖైదీ వద్దకు స్వయంగా వచ్చాడు. "నీ శ్లోకం

గురించి ఇప్పుడేమంటావు?" అని ఖైదులో ఉన్న విష్ణుశర్మను అడిగి, అవమానించాలని అతని ఉద్దేశం.

కాని ఖైదులో ఉన్నవాడు విష్ణుశర్మ కాదు, తన కొలువులో ఉండే ఒక ఉద్యోగి. ఏమిటిది? అని రాజు అడిగిన మీదట ఆ ఉద్యోగి నిజం దాచకుండా అంతా చెప్పేశాడు.

"నీ దుర్బుద్ధికి తగినట్టే జరిగింది. నీవు ఇంటికి వెళ్ళి, నేను ఆతిథ్య మిస్తానన్నానని చెప్పి ఆ విష్ణుశర్మను యిక్కడికి పంపించు," అన్నాడు రాజు.

రాజోద్యోగి తన ఇంటికి వెళ్ళి, "రాత్రంతా రాజుగారి దివాణంలోనే గడిపాను," అని విష్ణుశర్మతో చెప్పి, ఆయనను రాజుగారింటికి అతిథిగా పంపాడు.

రాజుగారు తన పైన కక్షబూని ఉన్నట్టు విష్ణుశర్మకు అణుమాత్రమైనా అనుమానం లేదు. ఆయన సాయంకాలం దాకా రాజుగారి వెంటనే ఉన్నాడు. తరువాత రాజు విష్ణుశర్మనూ, కొద్దిమంది నౌకర్లనూ వెంట బెట్టుకుని అరణ్యం కేసి వాహ్యాళికి బయలుదేరాడు. నిర్జన ప్రదేశంలో నౌకర్ల చేత విష్ణుశర్మను చంపించాలని రాజుగారి ఉద్దేశం.

వాళ్ళు అరణ్యంలో కొద్దిదూరం వెళ్ళేసరికి రాజుగారి గుర్రాని కెదురుగా పెద్ద పాము బుస్సు మంటూ లేచింది. గుర్రం బెదిరి వెనక కాళ్ళపైన లేచింది. పాము తప్పించుకు పోయింది. రాజుగారు గుర్రం పైనుంచి పడి తుంటి విరగగొట్టుకున్నాడు.

అనుకున్న దొకటీ, అయిన దొకటీ కాగా, రాజుగారిని నౌకర్లు ఎలాగో రాజభవనానికి చేర్చారు. రాజుగారు విష్ణుశర్మను ఆ శ్లోకం మళ్ళీ చదవమన్నాడు. అది తనకే అక్షరాలా వర్తించింది. అంత గొప్ప సత్యం చెప్పిన విష్ణుశర్మకు రాజుగారు ఘనంగా కట్నాలూ కానుకలూ ఇచ్చి పంపేశాడు. ఆ తరువాత ఆయన తనను పొగడుతూ కవిత్వం చెప్పిన వారిని ఆదరించటం మానేశాడు కూడా.





# రాళ్ల వ్యాపారం

ఒకసారి పాపన్న రెండు మూడామడ దూరాన గల తమ దూరపు బంధువు లింటికి వెళ్ళాడు. అది భోజనాలవేళ. ఇంటాయన భోజనం ముందు కూచుని, "అయ్యో, చచ్చా!" అనటమూ, బియ్యంలో రాళ్ళేర కుండా పూట పూటా వండుతున్నదని తన భార్యను తిట్టటమూ, వాకిటి మెట్లెక్కుతున్న పాపన్న చెవులపడింది.

పాపన్నను చూడగానే బంధువులు అతనికి కూడా వడ్డన చేశారు. పాపన్న అన్నం తింటూ, ముద్ద ముద్దకూ పంటి కిందికి రాయి రావటం చూసి, "బియ్యంలో ఇన్ని రాళ్ళెలా వస్తాయమ్మా?" అని ఇంటావిడను అడిగాడు.

"ఏం చెప్పను, నాయనా? ఈ మెట్ట ఊళ్ళలో వరి పండదుగదా. కొట్టు బియ్యమే గతి. వాటినిండా రాళ్ళు. ఏరటానికి కనిపించి చావవు, బియ్యం రంగులోనే ఉంటాయి. ఒక్క బియ్యమేమిటి? అన్ని ధాన్యాల లోనూ, జీలకర్రలోనూ కూడా రాళ్ళే. ఏ రంగు సరుకులో ఆ రంగు రాళ్ళు!" అన్నది ఇంటావిడ.

ఇంటాయన మటుకు, "కొట్టు నుంచి తెచ్చుకున్న సరుకు బాగు చేసుకోవటం చాతకాకపోతే ఏమవుతుందీ?" అన్నాడు.

ఈ రాళ్ళ అంతు తేల్చుకోవలసిందే ననుకున్నాడు పాపన్న. అతను తన బంధువులకు సరుకులిచ్చే కొట్టువాడి దగ్గిరికి పోయి, "మీ కొట్లో కొనే ప్రతి సరుకులోనూ రాళ్ళుంటాయిట. ఏమిటి కథ?" అని అడిగాడు.

"ఆ సంగతి నాకేం తెలుస్తుంది, బాబూ? నాది చిన్న కొట్టు. ఎలా వచ్చిన సరుకలాగే అమ్మేస్తున్నాను. ఊళ్ళో అన్ని కొట్లకూ సరుకులిచ్చే దానయ్యగారి నడిగితే సంగతి తెలియవచ్చు," అన్నాడు కొట్టువాడు.



పాపన్న దానయ్య వద్దకు వెళ్ళి, "మీరు చిల్లర కొట్టువాళ్ళ కిచ్చే బియ్యం నిండా రాళ్ళు వస్తాయే, దానికి కారణ మేమిటం టారు?" అని అడిగాడు.

"నేనేమన్నా పంట చేస్తున్నానా, నాయనా? నేను వరి పండించే రైతుల దగ్గిర కొంటాను. నువు చెప్పే రాళ్ళ సంగతి వాళ్ళకు తెలియ వచ్చు," అన్నాడు దానయ్య.

పాపన్న వరి పండించే గ్రామానికి వెళ్ళి రైతులను రాళ్ళ మాట అడిగాడు.

"మేమేమన్నా కొండల మీద వరి సాగు చేస్తున్నామా, బాబుగారూ? మేం తయారు చేసే బియ్యంలో ఎక్కడన్నా మట్టి బెడ్డ వస్తుందేమో గాని రాళ్ళెలా వస్తాయండీ?" అన్నారు రైతులు. వాళ్ళు తమ బియ్యం తెచ్చి పాపన్నకు చూపించారుకూడా.

ఒక ముసలి రైతు పాపన్నను రహస్యంగా అవతలికి తీసుకుపోయి, "దానయ్యగారిని గుట్టుగా పరీక్షిస్తేగాని మీ కీ రాళ్ళ వైనం అంతు చిక్కదు. ఆ దానయ్యగారు రంగు రంగుల రాళ్ళు ఒక గదిలో భద్రం చేసి ఉంచాడు. ప్రతి సరుకులోనూ నూరింట ఒకటి రెండు పాళ్ళు రాళ్ళు కలుపుతూ మంచి లాభాలు రాబట్టుతున్నాడు. ఉత్తుత్త బెదిరింపులకు జంకే రకం కాదు. రాళ్ళు కలుపుతూండగా పట్టుకోవాలి," అన్నాడు.

ఆ ముసలి రైతు దానయ్య చేసే మోసం గురించి చాలా వివరాలు చెప్పాడు. దానయ్య తాను ఉండే ఇంటనే ఒక భాగంలో వ్యాపారం జరుపుతాడు. ఇంట్లో అందరూ పడుకున్నాక ఆయన ఒక ప్రత్యేకమైన గదిలో కూర్చుని, అర్ధరాత్రిదాకా రాళ్ళు కలిపేపని సాగిస్తాడు.

పాపన్న ఆ రాత్రి దానయ్య ఇంటివేపు వెళ్ళి ముసలి రైతు చెప్పిన గది కిటికీ పైకి ఎక్కి, తలుపు సందులకుండా లోపల జరిగే దంతా గమనించాడు. దానయ్య రాళ్ళు కొలిచి, బస్తా కింత చొప్పున లెక్కగా బియ్యంలో కలుపుతున్నాడు.

"ఏమండో, దానయ్యగారూ! కలపకండి, కలపకండి, జనం చచ్చిపోతారు. కాస్త తలుపు తెరవండి. ఇదేం పని?" అని పాపన్న పెద్దగా కేక పెట్టాడు.

దానయ్య ఉలిక్కిపడి, "ఓరి, పిడుగా! దొంగతనానికి వచ్చావా?" అన్నాడు.

"దొంగతనానికి వస్తే మిమ్మల్ని పిలుస్తానుటండీ? తలుపు తెరవండి. మీతో ఒక ముఖ్యమైన సంగతి మాట్లాడాలిసి వుంది," అన్నాడు పాపన్న.

దానయ్య ఒక క్షణంపాటు తటపటాయించాడు. తలుపు తెరవకపోతే బయట ఉన్నవాడు కేకలుపెట్టి ఊరంతా లేపేస్తాడని భయపడి, ఆయన తలుపు తెరిచి పాపన్నను చూసి, "ఓహో, మీరా! ఎవరో అనుకున్నాను. లోపలికి రండి," అన్నాడు.

తరవాత దానయ్య పాపన్నతో, "ఈ వ్యవహారంలో మీరేమీ జోక్యం కలిగించుకోకండి. ఇదొక వ్యాపార రహస్యం. మీకీ విషయాలు తెలీవు. ఇందులో అబద్ధాలూ, మోసాలూ, కల్తీలూ ఎన్నో ఉంటాయి. ఇవన్నీ చేస్తేగాని లాభసాటిగా వ్యాపారం సాగదు. ఎన్నో దానాలూ, ధర్మాలూ చేస్తాను గదా. లాభాలు రాకపోతే ఎలా చెయ్యగలను? మీరే చెప్పండి," అన్నాడు.



"అయితే ఒకటి చెయ్యండి, దానయ్యగారూ. ఇలా రాళ్ళు కలపటంచేత మీ కెంత లాభం వస్తుందో అంతా నే నిస్తాను. ఈ పని మానండి," అన్నాడు పాపన్న.

దానయ్య నిర్ఘాంతపోయి, "అందువల్ల మీ కేం లాభం?" అన్నాడు.

"నా లాభం దేవుడిస్తాడులే. మీకు కావలిసిన లాభం లెక్కకట్టి చెప్పండి. ఆ మొత్తం రేపు పట్టుకొచ్చి మీ కిస్తాను," అన్నాడు పాపన్న.

దానయ్య ఇదంతా వేళాకోళ మనుకున్నాడు. ఆయన పాపన్నతో, "అయిదు వందల బస్తాల బియ్యం ఉన్నది. యాభై

బస్తాల కొక బస్తా రాళ్ళు కలిపితే నాకు పది బస్తాల బియ్యం ధర లాభం. అది ఇంత అవుతుంది," అని చెప్పాడు.

మర్నాడు పాపన్న తన దగ్గిర ఉన్న డబ్బు లెక్క చూసుకుని, కొంచెం కొరత అయితే ఎరిగిన వారి వద్ద చేబదులు తీసుకుని, ఆ సొమ్మంతా తీసుకుపోయి దానయ్యకిచ్చి, "ఇంద, మీ లాభం! జనానికి కాస్త మంచి సరుకు లందేటట్టు చూస్తూ ఉండండి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

"వీడెవడో బంగారు పిచ్చుకలాగున్నాడు. వెర్రివాడు, వీడి డబ్బు ఎవరో ఒకరు కాజేసి తీరుతారు," అనుకున్నాడు దానయ్య.

కొన్నాళ్ళు గడిచాక పాపన్న మళ్ళీ ఆ గ్రామం వచ్చి, బంధువులింట దిగి, "ఇప్పుడు బియ్యం వగైరా మంచివి దొరుకుతున్నాయి కద?" అన్నాడు.

"ఏం మంచి, నాయనా? ఎందు కడుగుతావు? మాకష్టాలకు దరీదాపూ లేనట్టున్నది," అన్నారు అతని బంధువులు.

పాపన్న తిన్నగా దానయ్య ఇంటికి వెళ్ళాడు. కొత్తగా కోడలిని కాపరానికి తీసుకు వచ్చిన దానయ్య ఊళ్ళోని పెద్దలకు విందు చేస్తున్నాడు. ఆయన పాపన్నను చూసి, దగ్గిరకు వచ్చి పలకరించి, "భోజనానికి లేవండి," అన్నాడు.



"భోజనానికేం గాని, మిమ్మల్ని ఒక్క విషయం అడగాలి," అంటూ పాపన్న దానయ్యను ఇవతలికి పిలిచి, "ఊళ్ళో వాళ్ళు ఇంకా బియ్యంలో రాళ్ళు వస్తున్నాయంటున్నారే? ఏం కారణమంటారు?" అని అడిగాడు.

"మీ రెంత అమాయకులండీ? మీ దగ్గిర మాట ఇచ్చాక నేను మళ్ళీ అలాటి పని చేస్తానా? కాని, నేను మానినంత మాత్రాన ఆ పాడు పని చిల్లర కొట్లవాళ్ళు మానవద్దుటండీ? వాళ్ళకూ్కడా లాభాశ ఉంటుంది, గద? వాళ్ళందరి చేతా కల్తీపని మానిపించటం మన తరంకాదు గదా, బ్రహ్మతరం కూడా కాదు. అందుచేత ఈ గొడవ వదిలెయ్యండి," అన్నాడు దానయ్య.

"అలా అయితే మీరు చిల్లర కొట్లవాళ్ళకి అమ్మటం మానేసి, మీ సరుకంతా నాకే అమ్మండి. నేను అందరికీ పంచేస్తాను," అన్నాడు పాపన్న.

పాపన్న ఎంత మొండి ఘటమో తెలుసుకుని ఆశ్చర్యపడిన దానయ్య, "ఆ సంగతి తరవాత చూస్తాం. ముందు భోజనానికి లేవండి," అన్నాడు.

అప్పటికి మొదటి పంక్తి భోజనాలయిపోయాయి. మరి కొందరితోబాటు పాపన్న రెండో పంక్తికి కూర్చున్నాడు. అతను ముద్ద



కలిపి నోట్లో పెట్టుకుని, "బాబోయ్, చచ్చాను!" అంటూ అంకిళ్ళు నొక్కుకుని గోడకి చేరగిల బడ్డాడు.

అదేస్థితిలో ఉన్న మిగిలిన వాళ్ళు ధైర్యం తెచ్చుకుని, "ఈ అన్నం తినలేం!" అంటూ విస్తళ్ళ ముందు నుంచి లేచారు. దానయ్యాకు కళ్ళ నీళ్ళ పర్యంతమయింది.

జరిగిన దేమంటే మొదటి వార్పు మంచి బియ్యమే వండారు. కాని అన్నం చాల లేదు. వంటవాడు సామాన్ల కొట్టులోకి వెళ్ళి రాళ్ళు కలిపిన బస్తా నుంచి బియ్యం తెచ్చి వండేశాడు.

బియ్యంలో రాళ్ళెందుకు వచ్చాయని ఆరాతీసిన బంధువులు వంటవాడు చెప్పిన కొట్టులోకి వెళ్ళి అక్కడ బియ్యం బస్తాల పై భాగాలలో రాళ్ళు పోసి ఉండటమూ, ఆ గదిలోనే ఒక పక్కగా రంగు రంగుల రాళ్ళుండటమూ చూశారు. దానయ్యా దొంగ తనం అందరికీ తెలిసిపోయింది.

కాని పాపన్న దానయ్యాతో, "దానయ్యా గారూ, మీరు మోసం చెయ్యనని నాకు ఇచ్చిన మాట నిలబెట్టుకున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఎందుచేతనంటే మీరు స్వయంగా ఇంట్లో వాడుకుంటున్న బియ్యం లాటివే ఊళ్ళో అందరికీ అమ్ము తున్నారు!" అన్నాడు.

ఈ మాట దానయ్యాకు శూలంలా గుచ్చు కున్నది. ఆయన పాపన్నను లోపలికి తీసుకు పోయి అతనికి డబ్బు సంచీ ఇస్తూ, "ఇదుగో, మీ డబ్బు! మిమ్మల్ని పరీక్షించటానికి తీసుకున్నానుగాని, ఈ డబ్బు నా కెందు కండీ? ఇంకో పది రోజు లాగి నే నమ్మే బియ్యం ఎలాటివో విచారించండి. నిజం మీకే తెలుస్తుంది!" అన్నాడు.

పాపన్న తాను చేసిన చేబదులు తీర్చేసి వెళ్ళిపోయాడు. ఆ తరవాత దానయ్యా కల్తీ వ్యాపారం మానేశాడు. ఊళ్ళో వాళ్ళు సుఖపడి పోయారు.






విభీషణుడు రాజ్యకాంక్షతో వచ్చాడని హనుమంతుడన్న మీదట రాముడు తన అభిప్రాయాన్ని కూడా బయటపెట్టుతూ, "ఈ విభీషణు డెంత దుర్మార్గుడు కానీయండి, శరణని వచ్చిన తరవాత నేను అతన్ని విడవలేను. అది సజ్జనుల పద్ధతి కాదు," అన్నాడు.

దానికి సుగ్రీవుడు ఒప్పుకోక, "ఇతను మంచి వాడే అయితే మాత్రం ఇతని వల్ల మన కేమిటి లాభం? ఇతన్ని మన మెంత మాత్రమూ చేర నివ్వగూడదు. అన్నను వదిలి వచ్చిన కృతఘ్నుడు మనను నమ్ముకుని ఉంటాడని ఏమిటి?" అన్నాడు.

"రాజులలో ఒక ధర్మం ఉన్నది. జ్ఞాతులు కూడా ఇరుగుపొరుగు రాజుల వంటి వారే; కష్టకాలంలో దెబ్బ తీస్తారు. అందుచేత యోగ్యులైన రాజులు కూడా బలవంతులైన జ్ఞాతులను నమ్మరు. ఇతన్ని రావణుడు నమ్మలేక పోయాడు. అందుచేత విభీషణుడు మన వద్దకు వచ్చాడు. మనం రాక్షసులం కాము; మనకు రాక్షస రాజ్యం పైన కాంక్ష లేదు. అందుచేత మన ద్వారా ఇతను రాజ్యం పొంద గోరుతున్నాడు. ఇతను మనని విడవడు," అన్నాడు రాముడు.

అయినా సుగ్రీవుడు తన మనసు మార్చుకోలేక, "రావణుడే ఇతన్ని ఇక్కడికి రహస్యంగా పంపాడు, సందేహం లేదు. నిన్నో, నన్నో, లక్ష్మణుణ్ణో కడ తేర్చటానికే ఇతను వచ్చాడు. అందరమూ కూడా చావ



వచ్చు. దుర్మార్గుడైన రావణుడి తమ్ముణ్ణి ఎలా నమ్మటం?'' అన్నాడు.

''సుగ్రీవుడా, ఇతను దుర్మార్గుడైతే మాత్రం నన్నేం చేయగలడు. ఇతను మారు వేషంలో వచ్చిన రావణుడే అయినా శరణన్న తరవాత విడిచి పుచ్చను. శరణార్థిని రక్షించటానికి ప్రాణాలైనా ఇవ్వాలి. అందు చేత నీవు వెంటనే అతన్ని తీసుకు రా!'' అని రాముడు సుగ్రీవుడితో అన్నాడు.

ఈ మాటలతో సుగ్రీవుడి మనసు మారింది. అతను వెళ్ళి విభీషణుణ్ణి రాముడి వద్దకు తీసుకు వచ్చాడు. విభీషణుడు తన నలుగురు అనుచరులతో బాటు రాముడి కాళ్ళపై పడి, ''నేను రావణుడి తమ్ముణ్ణి. అతని వల్ల అవమానం పొంది నిన్ను శరణు జొచ్చాను. నా స్నేహితులనూ, నా సర్వస్వాన్నీ లంకలో వదలి యిక్కడికి వచ్చాను. ఇక నా జీవితమూ, నా సౌఖ్యమూ, నా రాజ్యమూ నీ చేతిలో ఉన్నాయి,'' అన్నాడు.

రాముడు విభీషణుణ్ణి ఆశ్వాసించి, ''రాక్షసుల బలాబలాలను యథార్థంగా వివరించి చెప్పు,'' అన్నాడు.

దానికి విభీషణు డిలా చెప్పాడు :

''గంధర్వ ఉరగ రాక్షసుల చేతనూ, ఏ భూతం చేతనూ చావు లేకుండా రావణుడు బ్రహ్మ నుంచి వరం పొందాడు. రావణుడికి తమ్ముడూ, నాకు అన్నా అయిన కుంభకర్ణుడు మహా బలశాలి, యుద్ధంలో ఇంద్రుడికి సమానుడు. రావణుడి సేనాపతి అయిన ప్రహస్తుడు కుబేర సేనాపతి అయిన మాణిభద్రుణ్ణి జయించిన వాడు. హనుమంతు డతన్ని గురించి చెప్పే ఉంటాడు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు వర ప్రసాదుడు; అతను అభేద్యమైన కవచం ధరించి, యుద్ధం చేస్తూనే అదృశ్యుడైపోయి శత్రువులను చంప గల వాడు. మహోదరుడూ, మహాపార్శ్వుడూ, అకంప

నుడూ అనే రావణ సేనాపతులు దిక్పాల కులతో సమంగా యుద్ధం చెయ్య గల వారు. రక్తమాంసాహారులూ, కామరూపులూ అయిన రాక్షసులు లంకలో పదివేల కోట్ల మంది ఉన్నారు. వారి సహాయంతోనే రావ ణుడు దిక్పాలకులను జయించాడు."

విభీషణుడు చెప్పిన ఈ మాటలు విని రాముడు, "విభీషణా, ఈ పనులన్నీ చేసిన రావణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, రావణుడి బల గాన్నీ చంపి, లంకా రాజ్యం నీకు చేకూర్చు తాను, నా మాట నమ్ము. అతను రసాత లానికి పోనీ, పాతాళానికి పోనీ, బ్రహ్మ లోకానికే పోనీ, నేను ప్రాణాలతో వదలను. అతణ్ణి సపరివారంగా వధించ కుండా అయో ధ్యకు తిరిగిపోను, నా ముగ్గురు తమ్ముల మీద ఒట్టు!" అన్నాడు.

"ఆ యుద్ధంలో నేను కూడా పాల్గొని శక్తికొద్దీ రాక్షసులను చంపుతాను, మీకు సహాయం చేస్తాను," అన్నాడు విభీషణుడు.

రాముడు సంతృప్తుడై లక్ష్మణుడితో సముద్రజలం తెచ్చి, విభీషణుణ్ణి లంకకు రాజుగా అభిషేకించ మన్నాడు. లక్ష్మణుడు వానరుల మధ్య విభీషణుణ్ణి లంకా రాజ్యాభి షిక్తుణ్ణి చేశాడు. వానరులు సింహనాదాలు చేసి రాముడికి జయధ్వానాలు పలికారు.



తరవాత సుగ్రీవ హనుమంతులు విభీష ణుడితో ఏకాంతంగా చేరి, "ఇంత మందిమీ ఈ మహాసముద్రాన్ని దాటి లంక చేరట మెలాగో మాకు తెలియలేదు. ఆ ఉపాయం నీవే చెప్పాలి," అన్నారు.

"రాముడు సముద్రుడి శరణు పొందాలి. సముద్రుడు రాముడి పూర్వీకు డైన సగరుడికి ఋణపడి ఉన్నాడు; అందు చేత రామకార్యం తీరుస్తాడు," అన్నాడు విభీషణుడు.

సుగ్రీవుడు రామలక్ష్మణులున్న చోటికి వెళ్ళి, విభీషణు డన్న మాట చెప్పి, సముద్రుణ్ణి ఆరాధించాలని రాముడితో



అన్నాడు. రాము డందుకు ఒప్పుకుని, సముద్రతీరాన దర్భలు పరిచి, వాటి పైన పడుకున్నాడు.

ఈలోపుగా శార్దూలు డనే రాక్షసుడు, రావణుడి వేగులవాడు, వానరసేన ఉన్న చోటికి వచ్చి, అక్కడి పరిస్థితులన్నీ చూసి, రావణుడి వద్దకు తిరిగివెళ్ళి, "వానర భల్లూకసేన అపరసముద్రంలాగా లంక పైకి వస్తున్నది. ఉత్తమాయుధాలు ధరించి సీత కోసం వస్తున్న రామలక్ష్మణులు సేనతో సహా సముద్రతీరాన విడిసి ఉన్నారు. ఆ సేన యొక్క విస్తీర్ణం ఎటు చూసినా పది యోజనాలున్నది. నేనీ విషయాలు స్థూలంగా చూసి వచ్చాను. వివరంగా చూసి రావటానికి మరెవరినైనా పంపటం మంచిది," అన్నాడు.

అప్పుడు రావణుడు శుకు డనే రాక్షసుడితో, "నీవు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, మంచిగా ఈ మాటలు చెప్పు," అని, ఏమి చెప్పాలో చెప్పి పంపాడు.

శుకుడు పక్షి రూపం ధరించి లంక నుంచి బయలుదేరి సముద్రం దాటి, వానర సేన దగ్గరకు ఎగురుతూ వెళ్ళి, సుగ్రీవుడు మొదలైన వారి మీదుగా గాలిలోనే ఉండి ఇలా చెప్పాడు :

"వానర రాజైన సుగ్రీవుడా! రావణుడిలా అన్నాడు : ఉన్నత వంశంలో పుట్టిన వాడవు. మహాబలుడవు. జన్మతః నాకు బంధువులాటి వాడివి. అకారణంగా నాతో విరోధ మెందుకు? ఇందువల్ల నీకు ఒరిగేదీ, తరిగేదీ లేదు. వాలి నా స్నేహితుడు. నీవు నా తమ్ముడిలాటి వాడివి. నేను రాముడి భార్యను తెస్తే నీ కేమిటి? బుద్ధిమంతుడవు, బాగా ఆలోచించుకుని కిష్కింధకు తిరిగి వెళ్ళు. ఈ విషయంలో నీ ప్రమేయ మేమీ లేదు. లంకను దేవతలే ప్రవేశించ లేరు గదా, నరుల మాటా, వానరుల మాటా చెప్పే దేమిటి?"

ఈ మాటలు వింటూనే వానరులు ఆకాశాని కెగిరి శుకుణ్ణి పట్టుకుని ఆకాశం మీది నుంచి నేల మీదికి పడదోశారు. శుకుడు ఎలుగెత్తి, "ఓ రామా, నన్ను వానరులు చంపేస్తున్నారు. దూతను చంపరాదు. నా ప్రభువు అనమన్న మాటలే అన్నాను గాని నేను సొంతాన ఏమీ అనలేదు," అని అరిచాడు.

రాముడు జాలిపడి, "వాణ్ణి చంపకండి," అన్నాడు వానరులతో.

శుకుడు దెబ్బతిన్న రెక్కలతో ఆకాశంలోకి లేచి, "సుగ్రీవుడా, రావణుడితో ఏం చెప్పమంటావు?" అని అడిగాడు.

"రావణుడితో ఇలా అన్నానని చెప్పు: రాక్షసరాజా, నీవు నాకు స్నేహితుడవు కావు, మేలుచేసిన వాడవు కావు, నా మిత్రుడైన రాముడికి శత్రువువు, నా శత్రువైన వాలికి మిత్రుడవు. అందుచేత తప్పక చంపదగిన వాడవు. నేను నిన్ను సకుటుంబంగా చంపి లంకను భస్మీపటలం చేస్తాను. నిన్ను రాముడి బారి నుంచి దేవతలు కూడా రక్షించ లేరు. ముసలి జటాయువును చంపినట్టు కాదు; రామలక్ష్మణులు లేనప్పుడు దొంగతనంగా సీతను ఎత్తుకు వచ్చినట్టూ కాదు; రాముడి ప్రతాపం నీకు తెలియదు," అని సుగ్రీవుడు శుకుడితో అన్నాడు.





అంతలో అంగదుడు సుగ్రీవుడితో, "వీడు దూతలాగా లేడు, వేగుల వాడని తోస్తున్నది. మనతో మాట్లాడుతూనే శిబిర మంతా చూశాడు, వీణ్ణి పట్టుకోండి. లంకకు పోనివ్వకండి," అన్నాడు.

సుగ్రీవుడి అజ్ఞానుసారం వానరులు శుకుణ్ణి మళ్ళీ పట్టుకున్నారు. శుకుడు మళ్ళీ ఆక్రోశిస్తూ, "ఓ రామా, దూతనైన నన్ను ఈ వానరులు రెక్కలు విరుస్తున్నారు, కళ్ళు పీకేస్తున్నారు," అని పెద్దగా మొరపెట్టుకున్నాడు.

రాముడు కోతులతో చెప్పి శుకుణ్ణి కాపాడాడు. తరవాత అతను సముద్రుడికి నమస్కరించి చెయ్యి తల కింద పెట్టుకుని, సముద్రుడికి ఎదురుగా పడుకున్నాడు.

రాము డలా మూడు రాత్రులు గడిపాడు, అంతకాలమూ సముద్రుణ్ణి ధ్యానించాడు. కాని సముద్రుడు సాక్షాత్కరించ లేదు. అతనికి కోపం వచ్చింది. లోకంలో మంచి వాళ్ళు అసమర్థులుగా గణించబడతారు. సముద్రుడు తనను అలాగే భావించి ఉంటాడు. అందుచేత రాముడు సముద్రుడికి తన ప్రతాపం చూప నిశ్చయించి, లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా ధనుర్బాణా లిలా ఇయ్యి. సముద్రాన్ని ఎండించి, వానరులు కాలి నడకన లంకకు చేరేలాగు చేస్తాను. సముద్రంలోని జలమంతా భూమి పైకి పారేటట్టు చేస్తాను," అన్నాడు.

అతను బాణాలు ఎక్కుపెట్టి వదిలాడు. అవి ధగధగా వెలిగిపోతూ వెళ్ళి సముద్రం ప్రవేశించి, సముద్రాన్ని అల్లకల్లోలం చేశాయి. సముద్రంలో బ్రహ్మాండమైన తరంగాలు పుట్టాయి, నీటి అడుగున ఉండే శంఖాలూ, ముత్యపు చిప్పలూ, భయంకరమైన సముద్ర ప్రాణులూ పైకి తేలాయి.

లక్ష్మణుడు రాముడి చెయ్యి పట్టుకుని, "ఇంక చాలు! ఊరుకో!" అన్నాడు. రాముడు వినిపించుకోలేదు.



"సముద్రుడా! నిన్ను పాతాళం దాకా ఇగిర్చేస్తాను! నీలో ఉన్న ప్రాణులన్నిటినీ దహించేసి, నిన్ను ఇసుకపఱ్ఱగా చేసి వదిలే స్తాను! నా బలపరాక్రమాలు నీకు తెలి యవు! నేను నిన్నేం చెయ్యగలనో తెలు సుకో లేకుండా ఉన్నావు!" అన్నాడు రాముడు, తనకు ప్రత్యక్షం కాని సముద్రుడితో.

అత నొక భయంకరమైన బాణాన్ని తీసి బ్రహ్మాస్త్రం పఠించి, చెవి దాకా లాగాడు. అతను దాన్ని వదిలిపెట్టక మునుపే భూమ్యాకాశాలు బద్దలయినంత పని అయింది; కొండలు అదిరాయి; లోకాలన్ని టినీ చీకటి ఆవరించింది; నదులూ, సర స్సులూ కలకపారాయి. సూర్యచంద్రుల, నక్షత్రాల గతులు తప్పాయి. చీకటి కమ్మింది. పిడుగులు పడ్డాయి. ఆకాశాన ప్రచండమారుతాలు వీచాయి. వాటి వేగా నికి మహావృక్షాలు విరుచుకు పడిపోయాయి. ఈ ఉత్పాతాల మధ్య సముద్రపు నీరు ఒక ఆమడ వెనక్కు పోయింది. సము ద్రుడు వెనక్కు తగ్గటం చూసి రాముడు బాణం వదలలేదు.

అంతలోనే సముద్ర మధ్యంలోని బ్రహ్మాండమైన అలల మధ్య నుంచి సము



ద్రుడు, సమస్త నదులూ వెంట రాగా, వెలువడి వచ్చాడు. ఆయన దేహం వైడూర్య వర్ణంగా ఉన్నది; ఎఱ్ఱని మాలలూ, బట్టలూ ధరించాడు, రంగురంగుల పుష్పమాలికలు తలలో ధరించాడు; అనేకమైన బంగారు నగలు ధరించాడు; అతని మెడలోని ముత్యాల హారాల మధ్య కౌస్తుభమణి యొక్క తోబుట్టువు ప్రకాశిస్తున్నది.

సముద్రుడు రాముణ్ణి సమీపించి, ముందుగా తానే రాముడి పేరు చెప్పి నమ స్కరించి, "రామా, లోతు అన్నది నాకు స్వభావసిద్ధమైనది. ఆ గుణాన్ని నేను విస ర్జించలేను. కాకపోతే, వానరులు వారధి

కట్టేటప్పుడు వారికి సముద్ర ప్రాణుల భయం లేకుండా చెయ్యగలను, వారికి సహాయపడగలను," అన్నాడు.

"అలా అయితే, ఎక్కుపెట్టిన ఈ అమోఘాస్త్రాన్ని ఏమి చెయ్యను?" అని రాముడడిగాడు.

"ఇలా ఉత్తరంగా ద్రుమకుల్య మనే అందమైన ప్రదేశం ఉన్నది. అక్కడ భయంకరులైన దొంగలు కొందరుండి, నా జలాన్ని తాగి, సమస్త పాపకార్యాలూ చేస్తున్నారు. ఎంతో కాలంగా వారి స్పర్శ సహించ లేకుండా ఉన్నాను. నీ బాణాన్ని వారిపై ప్రయోగించు," అని సముద్రుడు, రాముణ్ణి కోరాడు.

ఆ ప్రకారమే రాముడు తన బాణాన్ని ద్రుమకుల్యం పైన ప్రయోగించాడు. ఆ బాణం పిడుగులాగా వెలుగుతూ వెళ్ళి పడినచోటుకు మరుకాంతార మని పేరు వచ్చింది. బాణం పెద్ద మోతతో భూమిని చీల్చుకుని వెళ్ళిన చోట పాతాళం నుంచి జల పుట్టుకొచ్చింది. వ్రణకూపమని పేరు పొందిన ఆ జల ఎన్నడూ అగక ప్రవహిస్తూనే ఉంటుంది. ద్రుమకుల్యంలో ఉండిన దొంగలందరూ నశించారు.

అప్పుడు సముద్రుడు రాముడితో, "నీ సేనలో గల నళు డనే వానరోత్తముడు విశ్వకర్మ కొడుకు. శిల్ప విద్యలలో తండ్రికి తీసిపోడు. ఇతని చేత సేతువు నిర్మింపజెయ్యి. అది మునగ కుండా నేను చూస్తాను," అన్నాడు.

ఈ మాట చెప్పి సముద్రుడు అంతర్ధానం కాగానే నళుడు, "సముద్రు డన్న మాట నిజమే. నేను సేతువు నిర్మించ గలను. నా శక్తి మరొకరు చెబితే బాగుంటుందని నాకై నేనే చెప్ప దలచలేదు. కావలిస్తే వానరులందరూ కలిసి ఇప్పుడే సేతు నిర్మాణం ప్రారంభించవచ్చు," అన్నాడు రాముడితో.



# నెహ్రూ కథ

## 2



**1889** నవంబరు 14, మార్గశిర బహుళ సప్తమినాడు అలహాబాదులో మోతీలాలుకు ఒక కుమారుడు కలిగాడు. అతనే జవాహర్ లాల్. సంపన్నుల బిడ్డ, తొలి సంతానం; మరి పదకొండేళ్ళపాటు ఆ దంపతులకు పిల్లా, పాపా కలగనే లేదు. అందుచేత జవాహర్‌లాల్ చాలా గారాబంగా పెరిగాడు. కాని అతనికి తన ఈడు వాళ్ళ సాంగత్యం లేదు. బళ్ళో వేస్తే తోటిపిల్లలతో ఆడుకునే అవకాశం ఉండేదేమో; కాని అతన్ని బడికి పంపక, ఇంటి వద్దనే పంతులమ్మనూ, ట్యూటర్లనూ ఏర్పాటు చేశారు.

జవాహర్ వెంట అస్తమానమూ ఉండి, చదువు చెప్పిన పంతులమ్మ ఆంగ్ల స్త్రీ. మోతీలాల్ మిత్రులలో ఆంగ్లేయు లుండే వారు. వారు తరచు మోతీలాల్ కోసం వస్తూ ఉండేవారు. ఈ ఆంగ్ల వ్యక్తులపై జవాహర్లాలుకు చాలా గౌరవం ఉండేది. అయితే భారతదేశాన్ని తమ అధీనంలో ఉంచుకుని పరిపాలిస్తూ, భారతీయులను హీనంగా చూసే ఆంగ్లేయుల జాతిపైన అతనికి చాలా కోపంగా ఉండేది. ఎందుకంటే ఈ ఆంగ్లేయుల అహంభావాన్ని గురించి అనేక నిదర్శనాలను పెద్దవాళ్ళు మాటల సందర్భంలో చెప్పుకునేవారు. జవాహర్లాలు బంధువర్గంలో ఒకత నుండే వాడు; వీలున్నప్పుడల్లా ఇంగ్లీషువాళ్ళతోనూ, ఆంగ్లో ఇండియనులతోనూ కొట్లాటలకు దిగే వాడు. ముఖ్యంగా రైలు ప్రయాణాలలో ఈ తగాదాలు జాస్తిగా ఉండేవి. రైళ్ళలో ఆంగ్లేయులకు ప్రత్యేకమైన పెట్టె లుండేవి. మామూలు పెట్టెలలో కూడా "దొరలు" ఎక్కి కూర్చున్నారంటే భారతీయులను ఎక్కనిచ్చేవారు కారు. పార్కుల్లో కూడా



తెల్లవాళ్ళకు ప్రత్యేకమైన బెంచీ లుండేవి. ఇలాంటి సంగతులు వింటూంటే జవాహర్‌కు మండిపోయేది.

స్నేహితులతో కలిసి కులాసాగా కబుర్లు చెప్పుకునేటప్పుడు మోతీలాల్ ఇల్లెగిరి పోయేటట్టు నవ్వేవాడు. ఆయన నవ్వు గురించి అలహాబాదులో అందరూ చెప్పుకునే వారు. మోతీలాల్ దేహబలమూ, ధైర్యమూ, తెలివితేటలూ చూసి జవాహర్లాల్ ఎంతో గర్వపడేవాడు; పెద్దయితే తాను కూడా అలా తయారు కావాలని వాంఛించేవాడు.

తండ్రి అంటే అభిమానంతోపాటు అతనికి భయం కూడా ఉండేది. ఎందుకంటే మోతీలాల్ నవ్వులాగే ఆయన క్రోధం కూడా అపూర్వమైనది. ఆయన పనివాళ్ళ మీద గాని ఇతరుల మీద గాని అలిగినప్పు డతను వణికిపోయేవాడు. ఆయన ఆగ్రహన్ని పోలినదాన్ని పెద్దయాక కూడా తాను ఎన్నడూ చూడలేదని జవాహర్లాలు చెప్పుకున్నాడు.

ఈ ఆగ్రహనికి ఒకసారి జవాహర్లాలే గురి కావటం జరిగింది. అతను అయిదారేళ్ళ కుర్రవాడై ఉన్నప్పుడు తన తండ్రి ఆఫీసు బల్లపైన రెండు ఫౌంటెన్ పేనాలుండటం చూసి, తన తండ్రికి రెండెందుకని ఒకటి తాను తీసేసుకున్నాడు. పోయిన పేనా కోసం ఇల్లంతా గాలింపు జరగటం చూసి బెదిరిపోయి, ఆ కలం తాను తీసినట్టు చెప్పలేకపోయాడు. చివరకు దొంగతనం బయట పడింది. జవాహర్లాలును తండ్రి చితకగొట్టేశాడు. ఒళ్ళు హూనమై జవాహర్లాలు తల్లిని ఆశ్రయించాడు.

తనను శిక్షించాడని జవాహర్లాలు తండ్రి పై కసి పెట్టుకోలేదు. శిక్ష పెద్ద మోతాదులో ఇవ్వబడినప్పటికీ సకారణంగానే ఇవ్వబడినట్టు అతనికి తోచింది. తండ్రి పై ఎంత ప్రేమాభిమానాలున్నా, వాటితోబాటు భయం కూడా ఉండేది, కాని అతనికి తల్లి అంటే

ఏమీ భయం లేదు. అతను ఏంచేసినా ఆమె ఏమీ అనేది కాదు. పై పెచ్చు ఆమె పైన కాస్త థాష్టీకం కూడా చేసేవాడు. తండ్రి దగ్గిర కన్న తల్లి దగ్గిర ఎక్కువ కాలం గడిపేవాడేమో, అతను తండ్రికి చెప్పని విషయాలెన్నో తల్లితో చెప్పుకునే వాడు. ఆమె పిట్టలాటి మనిషి, అతను చిన్న వయసులోనే ఆమె అంత ఎత్తూ ఎదిగాడు, ఆమెను తనతో సమంగా భావించేవాడు. ఆమె అందమూ, అతి చిన్న హస్తాలూ, పాదాలూ అతనికి ఎంతో ముచ్చటగొలిపేవి.

మోతీలాల్‌కు చదువు చెప్పిన మున్షీ ముబారక్ అలీ అనే ముసలివాడి దగ్గిర కూడా జవాహర్లాలుకు చాలా చనువుండేది. 1857 తిరుగుబాటులో ఆయన కుటుంబానికి గల సర్వస్వమూ పోయింది. ఇంగ్లీషు సైనికులు ఆయన బంధు వర్గంలో చాలా మందిని చంపారు. ఈ అనుభవం మూలంగా ఆయన చాలా సహనం నేర్చుకున్నాడు. ముఖ్యంగా పిల్లల పట్ల ఎంతో మృదువుగా ఉండేవాడు. తనకు ఏ బాధ కలిగినా, ఏ కష్టం వచ్చినా జవాహర్ ఈ మున్షీ దగ్గిర చెప్పుకునేవాడు. ఆయన డొక్కలో దూరి కూర్చుని అరేబియన్ నైట్స్ కథలూ, 1857 తిరుగుబాటు గాథలూ వినేవాడు. ఈ మున్షీ



చాలా ఏళ్ళు బతికి, జవాహర్‌లాల్ బాగా పెద్దవాడయాక పోయాడు.

జవాహర్ తన తల్లి నుంచీ పెత్తల్లి నుంచీ రామాయణ భారత కథలు వినేవాడు. అతని పెత్తల్లి (పెత్తండ్రి నందలాల్ భార్య) అంతులేని పురాణ కథలు చెప్పేది. మత సంబంధమైన ఆచారాలూ, పూజలూ ఆడ వాళ్ళు మాత్రమే పాటించేవారు. మోతీలాల్, ఆయన అన్నల కొడుకులూ మత విషయాలను గురించి కాస్త వెటకారంగా మాట్లాడే వారు. జవాహర్లాల్ అప్పుడప్పుడూ తల్లి వెంటా, పెత్తల్లి వెంటా గంగకు వెళ్ళి స్నానం చేసేవాడు. అప్పుడప్పుడూ దేవాలయాలకు

కూడా వెళ్ళేవాడు, గొప్ప గొప్ప సన్యాసులను సందర్శించేవాడు. కాని ఇవేవీ అతనికి అంతగా పట్టేవి కావు.

పండగలు వచ్చేవి. వసంతోత్సవం (హోలీ), వచ్చేది. ఒకరిమీద ఒకరు రంగు నీళ్ళు కొట్టుకునేవారు. దీపావళికి ప్రమిద లలో వేలకొద్దీ దీపాలు వెలిగించి ఇంటి నిండా పెట్టేవారు. కృష్ణాష్టమీ, రామలీలా, దసరా మొదలైన వాటికి ఉత్సవాలు జరిగేవి. రక్షాబంధనం ఒక పండగ. ఇవి గాక ముహర్రమ్, ఈద్ లాటి ముస్లిమ్ పండగ లలో కూడా జవాహర్ పాల్గొనేవాడు. ఈద్ రోజులలో మున్షీ మిఠాయి పెట్టేవాడు. ఇతర ప్రాంతాల హిందువులకు లేని పండగలు కొన్ని కాశ్మీరు హిందువుల కుండేవి. వాటిలో నవరోజ్ (సంవత్సరాది) ఒకటి. ఆ రోజు అందరూ కొత్త బట్టలు కట్టుకునేవారు.

కాని జవాహర్లాలుకు అన్నిటినీ మించిన గొప్ప పండగ తన పుట్టినరోజు పండగ. అందులో తానే ప్రధానవ్యక్తి. ఆ రోజు ఉదయాన్నే అతన్ని గోధుమలతోనూ, ఇతర వస్తువులతోనూ తులతూచి ఆ వస్తువుల నన్నిటినీ బీదవాళ్ళకు పంచేవారు. తరవాత అతనికి కొత్త దుస్తులు తొడిగి, కానుక లిచ్చే వాళ్ళు. ఆ తరవాత విందు జరిగేది. అతని కల్లా ఒకటే విచారం—తన పుట్టిన రోజు ఎప్పుడోగాని రాదే అని. తరుచుగా తన పుట్టిన రోజు పండగ చెయ్యమని అతను ఆందోళన లేవదీశాడు కూడా!

అప్పుడప్పుడూ పెళ్ళిళ్ళు తగిలేవి. దూర గ్రామాలకు ప్రయాణమై వెళ్ళేవారు. ప్రయా ణాలు భలే సరదాగా ఉండేవి. పిల్లల ఇష్టమే ఇష్టం. పెళ్ళివారింట ఎన్నో కుటుం బాల పిల్లలు కలుసుకునే వారు—ఆడ పిల్లలూ, మగ పిల్లలూ కూడా. అలాటప్పుడు జవాహర్‌కు ఒంటరితనం ఉండేది కాదు. ఎంత అల్లరి చేసినా పెద్దవాళ్ళు అదుపు చేసేవారు కారు. —(ఇంకా వుంది)



# 33. ఇమామ్ రిజా సమాధి

ఇమామ్ రిజా, ఖలీఫా కానున్న తరుణంలో ఎవరో విషం పెట్టి చంపారట. ఆయన సమాధి మేషేద్‌లో ఉన్నది. ఏటా లక్షమంది షియా తెగకు చెందిన ముసల్మాను లీ సమాధిని సందర్శించి మొక్కుకుంటారు. అరేబియన్ నైట్స్ కథలలో వచ్చే ఖలీఫా హరూన్ అల్ రషీద్‌ను ఇక్కడే పాతిపెట్టారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మాతృమూర్తి చెంత

పంపినవారు:
పి. సి. పంతులు, రాజమండ్రి

Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

పాప కేమి చింత

పంపినవారు:
పి. సి. పంతులు, రాజమండ్రి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగస్టు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మాతృమూర్తి చెంత

రెండవ ఫోటో : పాప కేమి చింత

పంపినవారు : పెమ్మరాజు చిట్టిపంతులు

c/o శ్రీ పెమ్మరాజు కామేశ్వరరావు, రాజమండ్రి—3

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

## బాలచిత్ర సమితి

(పిల్లల ఫిలిమ్ సంఘం - ఇండియా)

హింగోరాణి హవుస్

డాక్టర్ అనిబిసెంట్ రోడ్డు

వొర్లి, బొంబాయి - 18

## కార్యదర్శి మనవి

పిల్లల కోసం చిత్రాలు తయారుచేయుటానికి తగిన కథలు కావాలి. కథలతో పాటు రెండు అరటావులకు మించని కథా సంగ్రహం కూడ ఇంగ్లీషులో గాని హిందీలో గాని మామూలు పోస్టులో పంపాలి.

# దిలీపు బృందం అన్వేషణ





చూడు దిలీప్! ఆ రామచిలుక సరిగ్గా ఎగర లేకుండా వుంది!




పాపం, దాని రెక్కలకు దెబ్బ తగిలినట్టుంది! దాన్ని రక్షించడం మనవిధి! అందరం వెళ్దాం పదండి!






అటువేపు ఎగిరిపోతూంటే నే చూశా!
అదెక్కడుందో మనం కనుక్కుతీరాలి దిలీప్! దాన్ని మనం చావనీకూడదు!




చీకటి పడిపోతోంది!
దిలీప్! మమ్మల్నెక్కడిక తీసుకెళ్తున్నావో తెలుసుకదూ!
మన 'ఎవరెడి'టార్చి నీతో తీసుకొస్తున్నావ్ కదూ!




మీరు చెప్పాలా! తెస్తున్నా అబ్బాయిలూ!
దిలీప్ దిలీపే!




అలాచూడు! చిలక అక్కడున్నట్టుంది! కొనవూపిరితోవుంది!
దాన్ని మనం పెంచుకోవచ్చు!




నిజంగా మన 'ఎవరెడి' టార్చే దాన్ని రక్షించింది!

87

